

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

ఎ. వి. ఎస్. అండ్ ఎ. ఎమ్. బి.

# విజ్ఞాపనము.

---

మహాశయులారా! ఇయ్యది మొట్టమొదట 1913 ఏప్రియల్ 18-19-వ తేదులయందు రాజమహేంద్రవరమున జరిగిన యాంధ్రసాహిత్య పరిషత్తుయొక్క ద్వితీయ సాంవత్సరిక సభయందు తత్సభికుల కోరికచే సంగ్రహముగ వ్రాసి చదువబడినది. తరువాత నాపరిషత్తువారి పత్రికయందు ముద్రింపబడిన యీయుపన్యాసమును చదివినవారిలో ననేకులు ఈ విషయమును యింకను విపులముగ జేసి వ్రాయవలసినదనియు నట్లు జేసినచో మనపూర్వుల శల్యతంత్ర నైపుణ్యము నెరుగుటకును ఆయుర్వేద విద్యార్థులావిద్యావిషయమున ననేక నూతనాంశముల దెలిసికొనుటకును అవకాశము కలుగునని చాల సాయలు నియమించుచుండుటచే వారి కోరిక ననుసరించి ఆయుర్వేదాంగ శల్యతంత్రమునందు దానినభ్యసించు క్రమమును విపులముగ వ్రాసి ప్రథమ భాగముగ నీ గ్రంథమాలయందలి నాలవగుచ్ఛముగ ముద్రింపించితిని. మరియు నిట్లే ఆయుర్వేదీయ శల్యతంత్రమునకు ప్రధానాంగములగు యంత్రములు, శస్త్రములు, క్షారదాహకర్మములు వీనిచే సాధితములగు ప్రసవ చికిత్సాదులగు శస్త్రచికిత్సోత్కృష్టతను వెవ్వేరుభాగముగ వ్రాసి యచిరకాలములో ముద్రించదలచినాడ. వెండియు నీభాగములను రాజయక్ష్మచికిత్సక విశారదులలో నగ్రగణ్యతనుబొంది ప్రకృత మాంగ్లద్వీపమున మెండిపు పర్వతములయందు (Mendip Hiils) రాజయక్ష్మకు వాతాతపిక చికిత్సాకుశలతచే (Open air treatment) బహుజనారోగ్యమును గలుగంజేయు నస్మత్ప్రియమిత్రులగు డాక్టర్ సి. ముత్తు యం. డి. వార్ల కోరికచే శీఘ్రకాలములోపలనే సర్వదేశీయులకుపయోగమగునట్లు ఆంగ్లభాషయందు కూడ ముద్రించుచున్నాడ.

దీనివలన వేదకాలము మొదలు వాగ్భటకాలమువరకు మనదేశమున శల్యతంత్ర మెట్లభివృద్ధినందినదియు అప్పటి విద్యార్థులెట్లభ్యసించుచుండినదియు దెలియ గలదు. ఇక నిందలి విషయవిశేష పరిజ్ఞానభారమును పాఠకులపై విడచి యింతటితో విరమించుచున్నాడను.

25-5-14.
ఆయుర్వేదాశ్రమం
మదరాస్.

డి. గోపాలాచార్యులు.

# ఆయుర్వేదాంగ శల్యతంత్రము.

## దాని నభ్యసించు క్రమము.



ఆయుర్వేదము. దానివిభాగములు.

ప్రాణికోటికి సంభవించు శారీరకాగంతుకము లనెడి వ్యాధులను దొలఁగించుటకై జగన్నిర్మాత యగు నాపరమపురుషుఁ డాయుర్వేదమును గల్పించె. ప్రజల నాగరకత ననుసరించి క్రమముగ నభివృద్ధిచెందిన యాయుర్వేదము వివిధచికిత్సల సౌకర్యమునకుఁగాను

1. శల్యతంత్రము = Science of Surgery.
2. శాలాక్యతంత్రము = Surgery of Eye, Nose, Throat &c. Ear diseases.
3. కాయచికిత్స = General Treatment.
4. భూతవిద్య = Demoniacal (Mental) Diseases.
5. కౌమారభృత్యము = Management of Children.
6. అగదతన్త్రము = Toxicology.
7. వాజీకరణతంత్రము = Science of Aphrodisiacs.
8. రసాయనతంత్రము = Science of Alterative tonics.

అని యెనిమిదిభాగములుగ దివ్యజ్ఞానసంపన్నులగు మహర్షులచే విభజింపఁబడియెను. అందు శల్యతంత్ర (శస్త్రచికిత్స) మెల్లతంత్రములలోఁ బ్రధానభాగమై యున్నది.

అనేకప్రకారాకారములగు శల్యములు శరీరమునఁబ్రవేశించురీతి, వానిస్థితి, గమనము, బైటకువెడలించు నుపాయములు, వానికావశ్యకములగు యంత్రములు, శస్త్రములు, వాని నిర్మాణము, ఆకృతి, పదను మొదలగునవియు, స్రావ, వర్ణ, గంధ, దోష, ఉపద్రవాది భేదములతోఁగూడిన శారీరకాగంతుక వ్రణముల విజ్ఞానంబును, ఆయారోగభేదముల ననుసరించి కనపఱచబడిన శస్త్రచికిత్సాభివృద్ధియు, అక్రమప్రసవాదులయందలి శస్త్రచికిత్సా నిపుణతయు, నేత్రశ్రోత్రగళాది శాలాక్యతంత్రమునందలి శస్త్రచికిత్సా కుశలతయు మొదలగు శల్యతంత్ర సంబంధవిషయములను వానియందుఁ జిరకాలమునకుఁ బూర్వము మహర్షులు కనఁబఱచిన గౌరవమును విశదముగఁ బ్రత్యేకముగ వ్రాయఁదలఁచి, ప్రకృతము మహర్షులు శల్యతంత్రము నెట్లు కనుఁగొనినదియు, దానినెట్లు శిష్యులకుఁ గర్మపథమున బోధించినదియు మాత్రము సుశ్రుతము ననుసరించి సంక్షేపముగ వ్రాయుచున్నాఁడ.

శల్యశబ్దనిరుక్తి.
శల్యస్వరూపము.

“ శలతి ఆశు గచ్ఛతి ” అను వ్యుత్పత్తివలన శరీరమున వేగముగను జఱుకుగను బ్రవేశించి సర్వ శరీరమునకు బాధను గలిగించెడి వస్తువునకు “శల్యము” (బాణము)” అని పేరు.

అథర్వణవేదమున శల్యశబ్ద మనేకస్థలముల భిన్నభిన్నార్థములయందుఁ బ్రయోగింపఁబడియున్నను విషదిగ్ధమగు బాణమనునర్థమందు అనేకముగ వినియోగింపఁబడియున్నది.

(అథర్వణవేద. కా. 4. పే. 542. 543.)

మఱియు సుశ్రుత (సూ. 26 అ) మున, సన్నని ముఖములుగలిగి, చురుకుగ లోన వెంటనే ప్రవేశించి ప్రాణములను హింసించెడి లోహమయము "శర ఏవాధికృతః" శల్యమని విస్పష్టముగ నున్నది.

శల్యతంత్రమును కనిపెట్టినమార్గము.

పరస్పరజయేచ్ఛచే యుద్ధమందుఁ బ్రయోగింపబడు ననేకాకారములగు శల్యములు (బాణములు) శరీరమునఁ బ్రవేశించి యమిత బాధల గలిగించు. అయ్యవి శరీరమునఁ బ్రవేశించు మార్గములను, వాని యునికిని, వాని గమనములను, పరిణామములను దెలిసికొనుటకుఁగాను, అంగప్రత్యంగాది భేదములుగల శారీరశాస్త్రము నభ్యసించిరి. అనంతరము వాని బాధలను దొలఁగింప ననేకోపాయముల నరయఁ బ్రయత్నించిరి. అందు విశేషోపాయంబులగు యంత్రశస్త్రములం గనుంగొనిరి. పిమ్మట శల్యముల యాకృతిభేదముల ననుసరించి కంకముఖము, సింహాస్యము మొదలగు యంత్రభేదములను, మండలాగ్రము, కరపత్రము, వృద్ధిపత్రము, వేతసపత్రము మొదలగు శస్త్రములను, జలూక, అయస్కాంతము, సూర్యకాంతము మొదలగు సాధనములను దెలిసికొనిరి. పైనిఁ జెప్పఁబడిన యంత్ర శస్త్ర సామగ్రిచే శరీరమునఁ బ్రవేశించి బాధచేయు శల్యమును బైటికి వెడలించుటకై ఛేదనభేదనాది శస్త్రకర్మములం గనిపెట్టిరి.

శస్త్రచికిత్సావిధానమునందు శరీరమున ప్రవేశించిన "శల్యము" అనువస్తువును వెలికిదీయుట కారంభింపఁ బడినదియగుట చేతనే "శల్యతంత్ర" మని యాయుర్వేదమున మహర్షులు వ్యవహరించిరి. క్రమాగతమగు శస్త్రచికిత్సాకుశలతచేత శరీరమున గ్రుచ్చుకొని బాధను గలుగజేయు ఇనుపతునకలు, దంతములు, ఎముకలు, రాతినలుసులు, ముండ్లు మొదలగు వానిని గూడ శల్యములనియే వ్యవహరించిరి. మరియు వాతాదిదోషములయొక్క యాధిక్యముచేత శరీరమునఁ బుట్టి శస్త్రాదులచే నివారింపందగిన విద్రధి మొదలగు వ్యాధులనుగూడ శల్యమనిరి. వెండియు, మఱికొందఱు మనశ్శరీరములకుఁ బాధను గలిగించెడి వాతాదిదోషములచేఁబుట్టు సామాన్యవ్యాధులను గూడ శల్యమని నుడివిరి. ఈరీతిఁ గ్రమప్రాప్తమగు జ్ఞానగరిమచే శల్యశబ్దమును శరీరమునకుఁ గలుగు సామాన్య బాధలయందు వినియోగించినను, శల్యతంత్రజ్ఞులగు ధన్వంతరి మొదలగువారు వెలుపలనుండి శరీరములోఁ బ్రవేశించిన బాణములనే శల్యశబ్దముచే వ్యవహరించిరి.

చరిత్రకారుల యాశయము.

ఆదియందు గ్రీక్ దేశీయు లీజిప్టు మతగురువుల వలన నార్యుల వైద్యశాస్త్రమును గ్రహించిరా? లేక అలెగ్జాండరు దండయాత్రకుఁ బిమ్మట గ్రీకుదేశీయుల వలన నార్యులే వైద్యశాస్త్రమును సంపాదించి చరక సుశ్రుతాది వైద్య గ్రంథముల

రించి, కాయ శస్త్రచికిత్సలను మహోన్నత పదవికిఁ దీసి కొనివచ్చిరా? యనువిషయము చర్చలో నున్నట్లు చరిత్ర కారులు వ్రాయుచున్నారు.

చరిత్రకారుల సిద్ధాంతము.

డాక్టరు వైజు అనువారు తన "ఆసియాయీల యౌషధ చరిత్ర (History of Medicine among the Asiatics) మను గ్రంథమున మొదటి యూహనే రూఢిపఱచియున్నారు. హిపక్రేటిస్ (Hippocratese) అనువారి సంగ్రహముల యందలి వైద్య పద్ధతులను గూర్చినవిషయములు విఖ్యాత శల్యతంత్రమను సుశ్రుతములోని విషయములతో సరిపోవు చున్నవనియు, మహర్షులచేఁ గనిపెట్టబడిన శస్త్రచికిత్సలు సుశ్రుతమున వర్ణింపఁబడినవనియు, ఇట్టి ఘనకార్యనిర్వహణము ఋషిపుంగవుల వలననే యుద్భవించె ననియు, అలెగ్జాండరు దండయాత్ర కాలముననే పూర్వదేశీయులగు నార్యులు కాయ శస్త్రచికిత్సలయం దమేయమైన జ్ఞానముగలవారై యపార మైన ఖ్యాతిని వహించి యుండిరనియు మొదలైన సంగతులను జరిత్రకారులు (Strabo & Arrian) చెప్పియున్నారు.

కాన శస్త్రవైద్యశాస్త్ర జ్ఞానముగల వారిలోఁ దైవి కాలిక జ్ఞానులగు మహర్షులే ప్రాథమికులని చెప్పవలయును.

శల్యతంత్ర ప్రాచీనత.

| | | |
|---|---|---|
| యజుర్వేద. | | కాం. ప్ర. మం |
| యజ్ఞస్యశిరోచ్ఛిద్యత. | | 6 - 4 - 9 |
| తస్మా అక్షినాసత్యా... సద్యోజంఘాం ఆయసీం విశ్పలాయై | } | ఋ 1-8-186-116 |

ఇత్యాది మంత్రబోధితమగు యజ్ఞశిరస్సంధాన, జంఘా సంధానాఽక్షిసంయోజన రూపమగు నాశ్వినేయుల శస్త్ర చికిత్సాకుశలత ఋగ్వేదాదులయందుఁ గనఁబడుటచేత శస్త్ర చికిత్సయొక్క ప్రాచీనత వ్యక్తమగుచున్నది. పౌర్వాపర్య మును గూర్చి చర్చించు నవనాగరకులగు కొందఱు చరిత్ర కారులు ఋగ్వేదాదులయందు విస్తరిల్లియు మంత్రపూర్వక ముగా నుండుటంబట్టి యా శస్త్రచికిత్సల ప్రాచీనతను గురించి యవగతము చేసికొనలేకుండుట విశేషాంశముగాదు.

దేవవైద్యులనంబరగు నశ్వినీదేవతల శస్త్రచికిత్సా కుశ లతను విశేషముగ ఋగ్వేదాదులయందుఁ బొగడుటచే శస్త్ర చికిత్స వైదికయుగమున నధికముగ వ్యాపకములో నున్నట్లు తెలియుచున్నది.

శల్యతంత్ర పరంపర అభివృద్ధి.

కాయచికిత్సయందగ్రగణ్యతను వహించిన "అగ్నివేశ, ఆత్రేయ" మతానుయాయియగు చరకుఁడు తనగ్రంథమునందుచికిత్స 25-వ అధ్యాయమున

1. పాటన = Excising.
2. వ్యధన = (Puncturing) venesection.
3. ఛేదన = (Cutting deep) amputation.
4. లేఖన = Scraping (as in granulation of the erplids.)
5. ప్రచ్ఛన = Scarifying.
6. సీవన = Sutaring (joining the edges of gaping wounds.)

ములను శల్యకర్మ భేదముల నారువిధములుగఁ జూపుటచే వారి కాలమున శల్యతంత్రమభివృద్ధిని బొందినట్లు తెలియుచున్నది. పిదప ఔపధేనవ, ఔరభ్రి, పుష్కలావత, కరవీర, మార్కండేయ, పరాశర, ధన్వంతరి ప్రభృతి శల్యతంత్రజ్ఞుల మతముల ననుసరించిన సుశ్రుతుఁడు తన గ్రంథమున చరకునికంటె "ఆహార్య (Extracting foreign substances) విస్రావ్య (Evacuating fluids)" ములను రెండు విధములగు శల్య కర్మముల నధికముగఁజేర్చి యెనిమిదియని చెప్పుటచేత చరకాచార్యుల కాలమునకంటె సుశ్రుతుని కాలమున శల్యతంత్ర చికిత్సలు మిక్కిలి యభివృద్ధిలోనున్నట్లు తేటఁబడుచున్నది. పిమ్మట వాగ్భటుఁడు తన "అష్టాంగసంగ్రహ" మను వృద్ధ వాగ్భటమున సూత్ర 34 అధ్యాయమునసుశ్రుతులుచెప్పిన యెనిమిది శస్త్రకర్మములు గాక ఉత్పాటన (Removing en mass) కుట్టన (Wet cupping) మథన (Scraping the nose) ఉద్ధరణ (Drawing or pulling out) ములను కర్మముల నాలిగింటి నధికముగఁజేర్చి మొత్తమున శస్త్రకర్మములు పదిరెండనియు

పిదప తన యష్టాంగహృదయమున శలాకచే జేయదగిన దాహ కర్మము (Cauterising) నుకూడ జేర్చి పదిమూడు శస్త్ర కర్మము లనియు నిరూపించి యున్నాడు. మఱియు నీశస్త్ర కర్మమున కుపయోగించెడు శస్త్రములను సుశ్రుతాచార్యులు వక్కాణించిన యిరువదిగాక శలాక, కర్త్రరి, సర్పవక్త్రము, కర్ణవ్యధనసూచి, సూచీకూర్చము, ఖజము, అను నీయాఱింటి నధికముగ వృద్ధవాగ్భట సూ 34 అధ్యాయమునఁ గనబరచుచు తన యష్టాంగహృదయమున బంధనములలో "ఉత్సంగ" అను బంధనము నధికముగ దెలుపుటచేతను సుశ్రుతుల కాలమున కంటె వాగ్భటులఁ కాలమునఁ గ్రమాగతమగు జ్ఞానగరిమచే శల్యతంత్ర చికిత్సలు వానిసాధనములు మిక్కిలి ప్రచార ములో నున్నట్లు తెలియుచున్నది. అనంతరము "ఉగ్రాదిత్య" ప్రభృతులు సుశ్రుతాది మతముల ననుసరించియే శల్యతంత్ర ముల నభివృద్ధికిఁ దెచ్చినట్లు దెలియుచున్నది.

శల్యగమనము.

పైఁ బేర్కొనంబడిన శల్యములు పలువిధ కారణము లచే శరీరమున వంకరగను, సరిగను, అడ్డము గను, ఊర్ధ్వముగను, క్రిందుగను, గ్రుచ్చు కొనును. ఈ అయిదింటిలో ముందు యేవిధముగ గ్రుచ్చు కొనినను అదేస్థలమున నుండుటయు లేక నైదువిధములగు గమ నములుగ మారుటయుఁ గూడగలదని దెలిసికొనిరి.

ఏప్రదేశము, వాపు, వేదన, ఎడతెగక నెత్తురుకారుట, పొక్కులతోఁ గూడి బుడ్డవలె పైకి పుటకరించి కలుషమై మృదువగు మాంసము కలిగిన వ్రణముతోకూడియుండుట అనుగుణములు గలిగియుండునో ఆప్రదేశము ప్రాయికముగ శల్యయుక్తమని దెలిసికొనుచుండిరి.

శల్యముయొక్క యునికి.

మిక్కిలి కఠినమై విశాలమైన శోఫ (వాపు) తోఁగూడి స్వభావ వర్ణరహితమైన చర్మ ప్రదేశము గలుగునపుడు శల్యము చర్మగతముగను, శల్యము ప్రవేశించినమార్గము పూడక, ఒత్తిడిచే నతిబాధయు, వాపు హెచ్చుటయు, పండుటయు, మంటలతోకూడి యుండుటయు కలిగినపుడు శల్యము మాంసగతముగను, పైలక్షణములతోఁగూడి వాపులేకయుండిన శల్యము పేశ్యంతర్గతముగను, (కండరముల మధ్యజేరుట) నరములయొక్క సంక్షోభము, నరములు బిగిసికొనుట, ఆక్షేపకాది వాతవేదనలు కలుగుట, ఇవికలిగిన శల్యము స్నాయుగతముగను, వాపుతో కూడిన సిరలు కలిగిన శల్యము సిరాగతముగను, ఆయా స్రోతస్సులయొక్క వ్యాపారములకును గుణములకును హాని కలిగిన శల్యము స్రోతోగతముగను, హృచ్ఛలనము గలిగి, ఒడలినొప్పులతోకూడి ధమనులయందలి రక్తము నురుగుతోను, శబ్దముతోను బయలువెడలుచుండిన శల్యముధమనీ

శల్యవిశేషజ్ఞానము.

గతముగను, అధికమైన సంక్షోభముతోఁ గూడిన వెము కలవలన శల్యము అస్థ్యంతర్గతముగను, వాపు అనేకవిధము లైన వేదనలు వీనివలన శల్యమస్థిగతముగను, అటులనే సంధులవ్యాపారములు నశించిన శల్యము సంధిగతముగను, కడుపుబ్బరము వ్రణముఖమున అన్నము మూత్రము మలము యివి కనుపడుచుండుటవలనను విశేషమగు కోష్ఠ వేదనల వలనను శల్యము కోష్ఠగతముగను తెలిసికొనియుండిరి. మరియు చర్మము మొదలగు వానియందు గ్రుచ్చుకొనియున్న శల్యములను ఆయా స్రావవిశేషములచేఁ గనుగొనియుండిరి.

సందిగ్ధశల్యజ్ఞానము.

శల్యములు కారణాంతరములచే లోనఁ బ్రవేశించినది కూడ తెలియని సమయవిశేషములయందు అభ్యంగ, స్వేద, మర్దనములవలన క్రమముగా నెఱుపు, శూలము, దాహము, క్షోభము యివి కలిగినను, నేయి పోసినప్పు డింకిపోయినను, చందనాది లేపములు శీఘ్రముగా నెండిపోయినను చర్మనష్టమైన శల్యముకలదని దెలియందగు. మాంసనష్టమగు శల్యమును వమన విరేచనాదులచే కలుగు కృశత్వము వలననగు శైథిల్యముచేతను, వేదనారూపమగు అనేకవిధములైన క్షోభములవలనను, వెరుపు మొదలగువానివలనను గుర్తింపవచ్చును. ఇటులనే కండరము, అస్థిసంధి, కోష్ఠము వీనియందు నష్టమైనశల్యము మాంస నష్టమువలెనే గుర్తింపవచ్చును. అస్థులయందు నష్టమగు

శల్యమును ఆయాసరముల యభ్యంజనము, స్వేదము, బంధనము, పీడనము, మర్దనము, చాచుట, ముడుచుట అనువాని వలన తెలియవచ్చును. స్నాయు, సిరా, స్రోతో ధమనుల యందు శల్యము నష్టమైయుండునపుడు రోగిని విరిగినచక్రములుగల బండిపైనెక్కించి మెరకపల్లములుగల మార్గమున నాబండిని వడిగానడిపించిన అప్పటి త్రొట్రుబాటుచే కలుగు క్షోభమునుబట్టి శల్యము నెఱుంగదగును. ఊపిరిపుచ్చుట ప్రాణాయామము మొదలగు సంరభమును కలిగించు వ్యాపారములచే శల్యనష్టస్థానమును బాధవలన సామాన్యముగ తెలియవచ్చును. మఱియు గుండ్రముగను, విశాలముగను, చతుష్కోణముగను, త్రిపుటముగను ఉండునదియునగు వ్రణాకారముచే శల్యనష్టస్థానమును నిశ్చయింపవచ్చును. అని యిట్లు సందిగ్ధ శల్యజ్ఞానము నేర్పరచిరి.

శల్యాకర్షణోపాయము.

శల్యములను ఆకర్షించెడి యుపాయములు ప్రతిలోమములనియు, అనులోమములనియు రెండు తెఱంగులనుండును. శరీరమున శల్యము ప్రవేశించినట్లె లాగిన అనులోమాకర్షణమనియు, తత్ప్రవేశమునకు ప్రతికూలముగ లాగిన ప్రతిలోమాకర్షణమనియు జెప్పబడును. అడ్డముగాదిగిన శల్యము నెత్తునపుడు ఛేదించియూడదీయుట సుఖకరముగాన మాంసాదులను ఛేదించి తీయవలయును. వక్షస్థలము, గెజ్జలు, కక్షము, పార్శ్వము వీని

యందు తగులుకొనిన శల్యమును, గొప్పముఖముగల శల్యమును, ప్రతిలోమమగు శల్యమును, పైకినుబికియుండకుండు శల్యమును ఛేదించి తీయఁగూడదు. శల్యము నూడఁబెఱికిన ప్రాణమును హరించు నెడలను, నిరపాయమై నష్టమైనపుడును శల్యము నాకర్షింపదగదు. చేతితోలాగదగిన శల్యమును చేతనేలాగవలయును కాని కంకపత్రాదులచే నూడబెఱకరాదు. తద్భిన్నములగు కనుబడుచుండు శల్యములను సింహముఖము, మకరముఖము, అహిముఖము మొదలగు యంత్రములచే లాగవలయును. కనుబడకుండు శల్యములు వ్రణాదులసంస్థానముచే దెలియదగియుండును గాన కంకముఖ, భృంగముఖ, వాయసముఖాది శస్త్రములచే నూడబెఱకవచ్చును. చర్మ, సిరా, స్నాయు, మాంసములయందుండు శల్యముల సందంశములచే లాగవలయును. లోహైత్వగాది గతమగు శల్యమును సందంశముచే గాక తాలయంత్రముచే నెత్తవలయును. రంధ్రమందుండు శల్యమును నాడీయంత్రముచే నాకర్షింపవలయును. వ్రణమును శస్త్రముచే మొదటఛేదించి రక్తము లేకుండఁజేసి స్నేహవిధియందు జెప్పబడినచొప్పున ఘృతముచే చెమర్పించి పట్టినిఁగట్టి స్నేహవిధియందు జెప్పబడినచొప్పున ఉష్ణోదకాదులచే నుపచారము జేయునది. సిరలయందుగాని స్నాయువునందుగాని తగులుకొనిన శల్యమును శలాకచేగదల్చి శస్త్రముచే నాకర్షింపవలయును. హృదయమునందు శల్యముండుతఱి చల్లనినీళ్ల చే

రోగిని త్రాసము (భయము) గలవానిగా జేసి శల్యము స్థలాంతరమునందించి వీలునుబట్టి శల్యమునాకర్షింపవలయును. చిక్కిన స్థానమునందుండి దురాకర్షమైయుండు నితరస్థానగతశల్యములను గూడ నిటులనే స్వమార్గమునందించి లాగవలయును. కష్టమై దృఢముగా శల్యము నాటుకొనినపుడు బలవంతులగు భృత్యులచే బిగియఁబట్టించి కంకపత్రాదులచే శల్యము నూడబెరకవలయును. కర్ణములుగల శల్యముల కర్ణములను కత్తరించి వానిని లాగవలయును. లేక నాడీయంత్రముచే నూడదీయవచ్చును. కర్ణరహిత శల్యములను ముఖమును తెలిచి ఋజువుగ నుండునట్లుజేసి అయస్కాంతముచే నాకర్షింపవచ్చును. పక్వాశయము నందియుండు శల్యముల విరేచనసాధనముచే బయలువెడలింపవచ్చును. శల్యము కంఠస్రోతస్సున జిక్కినపుడు నూలును తామరకాడచే గంఠమునందు బ్రవేశపెట్టి బిసమూశల్యమును గ్రహించినతరువాత వానిరెంటిని సమముగ నెత్తవలయును. లక్కపుడక కంఠస్రోతస్సున లగ్నమయ్యెనేని అగ్నితప్తమగు శలాకను నాడీయంత్రముచే లోఁబ్రవేశపెట్టి దాని నాకర్షింపవలయును. ఇతరములగు (లక్కతో సంబంధములేని వెదురుపుల్లమున్నగు) శల్యము లచ్చుట తగులొ్కనిన లక్కఁబూసి అగ్నితప్తమైయుండు శలాకను నాడీయంత్రముచే లోపలికెక్కించి దానిచే నాకర్షింపవలయును. మత్స్యాదులముండ్లు మొదలైనవి భోజనసమయమున కంఠ

స్రోతస్సున లగ్నము లయ్యేనేని వెంట్రుకలచుట్టకు నూలు కట్టి దానిని వమనద్రవ్యములు చేర్చబడిన ద్రవపదార్థములతో గొంతులోనికి చేర్చవలయును; అప్పుడు వమనముతో వెడలు నాముల్లు వెంట్రుకలబంతిని బట్టినప్పుడు నూలుచేలాగి అట్టి శల్యము నాకర్షింపవలయును. నోటియందుగాని ముక్కునగాని శల్యము లగ్నమై ఆమార్గమున బయలువెడలింప నశక్యమయ్యే నేని ఉపాయాంతరములచే కోష్ఠమునందించి వెడలింపవచ్చును. గడ్డిముల్లు కంఠదేశమున లగ్నమగునపుడు జలపానముచేగాని మూపున తట్టుటచేగాని కోష్ఠమునందించవలయును. కంటినిగాని వ్రణమునుగాని పొందియుండు శల్యమును పట్టు, వ్రత్తి, కుంచె, జలము వీనిలో వీలైనదానిచే వెడలించవలయును. నదీతటాకా దులయందుపడినపుడు నీరు కర్ణమందు ప్రవేశించి శల్యమువలె బాధించునపుడు చేతితోనలిపి నూనెను పోయవచ్చును. లేదా క్రిందకువంచి చేతితో మెల్లగమోదవచ్చును. మరియు శృంగా దులచే నీటినిపీల్చవచ్చును చీమలు కీటకములు మొదలగునవి కర్ణమున ప్రవేశించినపుడు ఉప్పునీటితోగాని సుఖోష్ణమగు శుక్తము (మద్యభేదము)తోగాని చెవినినింపవలయును. అంతట నా కీటాదులు జచ్చినపిదప బయలువెడలించవలయును. లక్క సంబంధమైనట్టియు ధాతు సంబంధమైనట్టియు శల్యములు దేహ జన్మైన ఉష్ణముచేతనే కొంతకాలమునకు కఱిగిపోవును. మృద్, వేణు, దారు, శృంగ, అస్థి, దంత, ఉపల వికారములగు

శల్యములు దేహోష్మముచే నశింపవు. శల్యములును అవి తగులొ్కను ప్రదేశములును వానినెత్తు యంత్రములును అనేక తెఱంగుల నుండునుగాన బుద్ధిమంతుడు శల్యము నెఱింగి తరువాత సింహ కంకముఖాది యంత్రములయొక్కయు అర్ధచంద్ర, అర్ధధారాది శస్త్రములయొక్కయు సహాయముచే ముందు చెప్పబడు భేదనచ్ఛేదనాది క్రియల నాచరించి వెడలించవలెను.

శారీరశాస్త్ర జ్ఞానము.

ముందు చెప్పఁబడిన-చొప్పున శరీరమునఁ జొచ్చిన శల్యములు వానిస్థితి గమనము మొదలగునవి శరీరమునందలి యంగప్రత్యంగాది జ్ఞానము లేకయే తెలియుట దుర్లభముగాన నామార్గములం దెలిసికొను రీతిని ఉపాయములను సుశ్రుతుఁడు తన సుశ్రుత శారీర పంచమాధ్యాయమున నీవిధముగ బోధించెను.

శారీరశాస్త్రమందుఁ బరిపూర్ణజ్ఞానమును గోరినయెడల మృతినొందిన మనుజునియొక్క కళేబరమును దృష్టకర్మము (Dissection) నకుఁగాను సిద్ధముచేసి ప్రత్యవయవ విభాగమును ప్రత్యక్షముగఁ బరీక్షింపవలయు.

పరీక్షార్థము నిర్దిష్టమైన మృతకళేబర మతివృద్ధునిదియు దీర్ఘకాల రోగపీడితమును విషాదులచే మృతినొందినదియు గాక సర్వావయవస్ఫూర్తి గలిగి యుండవలయును.

పరీక్షావిధానము.

ముందుగ మృతకళేబరముయొక్క యాంత్రమునందుం (intestines) డెడి పురీషమును వస్తికర్మము (Enema) చేఁ వెడలించి శోధనము జేయవలయును. పిదప ముంజగడ్డి, దర్భ, నార మొదలగు వానిచే నన్ని యవయవములను బాగుగఁ జుట్టి చేపలు మొదలగు నీటిజంతువులు తినకుండగను ప్రవాహమునఁ గొట్టుకొనిపోకుండగను పంజరస్థముగావించి నిశ్చలోదకము గల వాగునందు కుళ్ళుట కుంచవలసినది.

* ఏడుదినములైన తరువాత బాగుగఁ గుళ్లిన శరీరమును బైకిఁదీసి దర్భ, గడ్డి వీనివేళ్లతోఁ జేసిన కుంచెతోఁగాని లేక వెదురు కుంచెతోఁగాని చర్మము,

| | | |
|---|---|---|
| మాంసకండరములు | = | Muscles. |
| సిరలు | = | Veins. |
| స్నాయువులు | = | Nerves. |
| ధమనులు | = | Arteries. |
| ఆంత్రము | = | Intestines. |
| యకృత్తు | = | Liver. |
| ప్లీహము | = | Spleen. |
| హృదయము | = | Heart. |
| వృక్కములు | = | Kidneys. |

* మృతకళేబరమందలి విషము (Septic Poison) యొక్క క్రూరతను దగ్గించుటకై బాగుగఁ గుళ్లుట కేడుదినము లుంచుచుండిరని తోఁచెడిని.

పుప్పుసము = Lungs.
క్లోమము = Pancreas. ?

మొదలగు నాశయములను అస్థులు అస్థిసంధులు (Joints) మొదలగు త్వగా (Skin) ది బాహ్యాభ్యంతరమైన ప్రత్యవయవమును విభజించి బాగుగఁ బరీక్షింపవలయును.

ఈరీతి శారీరశాస్త్రమును జక్కఁగనభ్యసించి బాహ్యాభ్యంతరావయవములను మాటిమాటికిఁ బ్రత్యక్షముగఁ జక్కఁగఁ బరీక్షించి సందేహనివృత్తి చేసికొనవలయును.

శస్త్రచికిత్సాశాలయందు ముందు సిద్ధముగ నుండవలసిన వస్తుసముదాయము.
(Preliminary arrangements for surgical operations.)

శస్త్రములు = Instruments, Lancet etc.
యంత్రములు = Surgical appliances Forceps etc.
క్షారము = Alkali.
అగ్ని = Fire (for cauterisation).
జలూక = Leeches.
శలాక = Probe or Director.
అలాబు = Prepared gourd (for cupping).
జాంబవోష్ఠము = Cauterising instrument.
పిచువు = Cotton.
ప్లోతము = Lint.
సూత్రము = Thread.
పట్టము = Tow.
తేనె = Honey.
నెయ్యి = Ghee.

| | |
|---|---|
| క్రొవ్వు | = Lard. |
| పాలు | = Milk. |
| నూనె | = Oil. |
| తర్పణము | = Powdered wheat soaked in water. |
| కషాయము | = Decoctions. |
| ఆలేపనము | = Medicated plasters. |
| కల్కము | = Paste. |
| విసనకఱ్ఱలు | = Fans. |
| చన్నీళ్లు | = Cold water. |
| వేడినీళ్లు | = Hot-water. |
| కాగులు మొదలగు పాత్రలు | = Cauldrons. |
| కవలిక | = Splints. |

మృత్కపాలము (శరావములు మొదలగునవి), కంసము (శేరు కొలతపాత్ర), స్థాలి (చిన్నపాత్రలు), శయనము (మంచములు మొదలగునవి), ఆసనము (పీటలు - కుర్చీలు), మొదలగు పరికరములును, వెదురుపేళ్లు (Skin of Bamboos), స్ఫటికము (కోణయుక్తమగు వస్తువులు Lens), కురువిందపు రాళ్లు (Kuruvinda Stone), కాంతపురాళ్లు (Magnets), గాజుతునకలు (Bits of glass), ఈకు ఆకులు (Leaves of Shata patra, Sephalita, Goje. etc.), మొదలగు పదార్థములును, క్షౌమాది బంధనోపయోగ పదార్థములును, మత్తును గలుగఁజేయు తీక్ష్ణమద్యములును, సంజ్ఞాకర (జటామాంసి వస, మొద

లగు) ద్రవ్యములును, అనురక్తులును దృఢకాయులును సర్వకార్య సమర్థులును నగు సహాయులను, పరిచారికులను సిద్ధముగా నుంచికొనవలయును

మత్తును గలిగించుట.

శస్త్రకర్మము చేయుటకుఁ గొంతపూర్వ ముచితాహారముల భుజింపఁ జేయవలయును. శస్త్రచికిత్సా జన్యమగు బాధలు తెలియకుండునట్లు బాగుగ మత్తును గలిగించు మద్యములను ద్రాగింపవలయును. శస్త్రకర్మమునకుఁ బూర్వము భుజించుటచేత మూర్ఛ మొదలగునవి కలుగవు. మద్యద్రవ్యముల నుపయోగించుటచే బాధ తెలియకుండును. కాన శస్త్రకర్మమునకుఁ బూర్వము భుజింపఁజేయుటయు మద్యమును ద్రాగించుటయు నావశ్యకములు. 1872 సంవత్సరమున డాక్టర్. సర్. జేమ్సుదొరగారు క్లోరుఫారమును (Chloroform) కనుఁగొనుటకుఁబూర్వ మాంగ్లవైద్య విశారదులు కూడఁ బైమార్గముల నవలంబించుచు వచ్చిరి.

ఆయుధములు బట్టు కొను రీతి.

భేదనకర్మమునం దుపయోగించెడు వృద్ధిపత్రము మొదలగు శస్త్రములను బిడిసంధియందుఁ బట్టుకొనవలయును. లేఖ్యకర్మమునందు వృద్ధిపత్రము, మండలాగ్రము ననుశస్త్రములను గొంచెము చాపఁబడిన యఱచేతితోఁ బిడికిలియందుఁ బట్టు

కొనవలయును. మఱియు నీరెండుశస్త్రములను బిడియొక్క కొనను బట్టుకొని విస్రావణకర్మము చేయందగు రాజులు, రాజపుత్రులు, ముసలివారు, సుకుమారులు, బాలురు, స్త్రీలు శస్త్రమునకు భయపడువారు వీరలకు విస్రావణకర్మము చేయవలసినచోఁ బ్రతిసూర్చకమను శస్త్రముచేఁ జేయవలయును. వ్రీహిముఖము నుపయోగించునపుడు పిడి నఱచేతియందు మఱుగుపఱచి యాయుధము నంగుష్ఠప్రదేశినులతోఁ బట్టుకొనవలయును. కుఠారిక నెడమచేతియందు మోపుచేసి బొటనవ్రేలితోఁగాని మధ్యమాంగుళితోఁగాని తట్టవలయును. ఆరా కరపత్రము, ఏషణి వీనిని పిడిదగ్గఱఁ బట్టుకొనవలయును ఇతర శస్త్రముల నుపయోగము ననుసరించి వీలగునట్లు పట్టుకొనవలయును.

**అష్టవిధశస్త్రకర్మముల నభ్యసించు మార్గములు.**

శిష్యుఁడు శాస్త్రార్థములయందు జాగరూకుఁడైనను దృష్టకర్మములయం దభ్యాసము లేనివాఁడైనచోఁ జికిత్సలం జేయుటయం దర్హుఁడు గాఁడుగాన గురువు శిష్యుని ఛేదన భేదన లేఖనాది కర్మములయందును వైలాదులచేఁ జేయంబడు వస్తికర్మాదులయందును గర్మపథమున జెప్పంబోవు ప్రకారము సామ్యవస్తువులయందుఁ బలుమాఱు చూపి సుశిక్షితునిఁ జేయవలసినది.

ఛేదన విశేషములను బుష్పఫలంబు లనంబరఁగు సొర, పుచ్చ, నూగుదోస, బుడమ, పెద్దదోస మొదలగు కాయలను గోసిచూపవలయును. అదేవిధముగ ఉత్కర్తనము, (పైకికోయుట) పరికర్తనము (దిగువకుకోయుట) మొదలగువానినిఁ గూడ బోధింపవలసినది.

ఛేదనకర్మము. (Incising.)

భేద్యకర్మమును నీరునించిన తిత్తులనుగాని మృతజంతువుల మూత్రకోశములనుగాని జిగురువస్తువులతో, లేక పలుచనైన బురదతో నింపిన తోలు తిత్తులనుగాని చీల్చి చూపవలయును.

భేదనకర్మము. (Excising.)

లేఖ్యకర్మములను రోమయుక్తమగు చర్మమునం దనులోమ విలోమభేదముల నెఱింగి గీకిచూపవలసినది.

లేఖనకర్మము, (Scraping.)

వేధ్యకర్మము మృతజంతువులయొక్క సిరలను కలువకాడలు మొదలగు వానిని వేధించి (Blood-letting) చూపవలయును. ఇయ్యది కేవలము జలోదరము, మూత్రవృద్ధి మొదలగువానియం దుపయోగింపందగదు.

వేధనకర్మము. (Venesection.)

ఏష్యకర్మమును బురుగు తినిపోయిన బెజ్జములుగల కొయ్యతొఱ్ఱలయందును వెదురుగొట్టములు తూటికాడలు, తామరకాడలు, ఎండిపోయిన సొరకాయలు మొదలగువాని ముఖ

ఏష్యకర్మము. (Probing.)

ములయందును "ఏషణీ" యను శలాక నుపయోగించు విధమును జూపవలయును.

ఆహార్యకర్మము పనస, మారేడు, దొండ మొదలగు ఫలములనుండి గింజలను బైటికిఁదీయుటచే నభ్యసింపఁ జేయవలయును. పండ్ల నూడఁదీయుటను జచ్చినజంతువుల పండ్లనూడదీయుటచే నేర్పవలయును.

ఆహార్యకర్మము.
(Extracting.)

విస్రావ్యకర్మమును శాల్మలీఫలకమునందు మైనమును బూసి ప్రతిమలువ్రాసి యాయాప్రదేశముల నుండి చీము మొదలగు వానిని స్రవింపఁ జేయుమార్గములను జూపవలసినది.

విస్రావ్యకర్మము.
Secreting and
(exudating fluids)

మృదువగువస్త్రములను చర్మము మొదలగు వానినిఁగుట్టి సీవనకర్మమును జూపవలసినది.

సీవనకర్మము.
(Suturing.)

కనుబొమ, కణఁత, నొసలు, గండభాగము, కనుఱెప్ప, క్రింది పెదవి, పంటిచిగురు, చంక, కటి, బొడ్డు, గజ్జ, వీనియందుఁ దిర్యక్ఛేదనము చేయవలయును. అఱచేయి, అఱకాలు, వీనియందుఁ జంద్రమండలాకృతిగాఁ (గుండ్రఁగా) గోయవలయును. గుదము మేఢ్రము వీనియం దర్ధచంద్రాకృతినిఁ (Semilunar incisions) గోయవలయును. పైనిఁజెప్పిన చొప్పున నాచరింపనిచో నాయాప్రదేశములయందలి సిరలు (Veins) ధమనులు (Arteries) తెగి

స్థలభేదమున శస్త్రప్రయోగభేదములు.

పోయి క్రమముగ మిగుల బాధను గలిగించును. శీఘ్రముగ మానుట నారంభింపదు. మాంసగ్రంథులను గలుగంజేయును గాన జాగరూకతతో నొనరింపవలయు.

బంధనముల నభ్యసించుట.

బంధనాదికర్మములను గుడ్డలు, మన్ను, కఱ్ఱ, చర్మము మొదలగువానితోఁ జేయబడిన పురుషాకృతి యొక్క కరచరణాదులయందుఁ గట్టుటచే నభ్యసింపవలయును. క్షౌమము, (అవిసినారతో నేసినబట్ట) కార్పాసము (నూలుగుడ్డ), ఆవికము (కంబళి) దుకూలము (నారబట్ట), కౌశేయము (పట్టుబట్ట), పత్త్రోర్ణము (పౌండ్ర మగధదేశమందలి నాగ అను చెట్లనారచే నేయఁబడిన గుడ్డ), చీనపట్టము (చైనాదేశపుఁబట్టుబట్ట), చర్మము (పదనుచేయబడినతోళ్లు) అంతర్వల్కలము (ఒలుపు లేక భుజపత్రి), అలాబుశకలము (సొరకాయపైనితోలు), లతా (తెగడ మొదలగు తీగెలు), విదలము (వెదురు, పేము మొదలగునవి), రజ్జువు (త్రాళ్ళు), తూలఫలము (దూది), సంతానిక (పాలమీఁగడ), వీని నాయావ్యాధులయందు దేశమును గాలమును జూచి యుపయోగింపవలయును.

బంధనభేదములు. (Kinds of bandages.)

కోశ (సంచివలెనుండునది), దామ (మాలాకారము గలది), స్వస్తిక (× ఈరీతికాక పదాకృతి), అనువేల్లిత (మెలిగలది), ప్రతోలి (మెలికలు గల త్రోవవంటిది), మండల (గుండ్రముగ

నుండునది), స్థగిత (తమలపాకు చుట్టవలె కొనగలది), యమక (జంటగకట్టవలసినది.), ఖట్వా (మంచముగళ్లవంటిది), చినా (గాలిలోఁగదలునట్లుండునది), విబంధ (ఉచ్చువలెనుండునది), వితాన (చాందినివలె నుండునది), గోఫణ (ఆవుకొమ్మువలె నుండునది), పంచాంగీ (అయిదుభాగములుగలది) అని బంధనములు పదునాలుగు విధములు. వీని యాకృతులు నామములను బట్టియే తెలియఁబడుచున్నవి.

స్థలవిశేషమున బంధనవిశేషములు.

అంగుష్ఠాంగుళి పర్వములయందుఁ గోశబంధమును, ఇరుకైన యవయవములయందు దామమును, సంధులయందును గూర్చకమునను గనుబొమలు, మణిబంధము, చెవులు, స్తనములు మొదలగు ప్రదేశముల స్వస్తికమును, గాలుసేతులయం దనువేల్లితమును, మెడయందును మేఢ్రమందును బ్రతోలిని, గుండ్రని చోటులయందు మండలమును, అంగుళ్యగ్రమునను మేఢ్రాగ్రమునను స్థగికను, జంటయగు వ్రణములయందు యమకమును, గణఁతలు దవడలు వీనియందు ఖట్వను, నేత్రాంతములయందు జీనమును, బృష్ఠమునఁ గడుపున వక్షమునను విబంధమును, శిరస్సున వితానమును, చిబుక నాశి కౌష్ఠాంసులయందు గోఫణమును నిశ్లే యే ప్రదేశమున నేయేబంధము సుబద్ధమగునో దాని నచ్చోట బంధించి పిమ్మట వ్రణములకుఁ గ్రిందుగాను నడ్డముగాను ముడివేయవలయును.

పైన జెప్పంబడిన బంధములు విధివిహితమగు శస్త్ర కర్మము నొనరించిన పిదప శోధనరోపణాది కషాయములచే శుభ్రపరచి యందలి కషాయాది ద్రవద్రవ్యములను ప్లోతము (Swab) చే తుడిచి వ్రణమున నెట్టి క్రిములు చీము మొదలగు దోషములు బుట్టకుండగను శీఘ్రముగ నారునట్లుగను జెప్పంబడిన సాంబ్రాణి, గుగ్గిలము, అగరు, ఇంగువ ఆవాలు మొదలగువానిచే చక్కగ ధూపము వేశి పదంబడి నాయా ప్రదేశముల ననుసరించి "ప్రతోలి" మొదలగు బంధనముల నాచరింపవలెను.

బంధనములకై నుపయోగించెడు వస్త్రములు మొదలగునవి శుభ్రముగను గట్టిగను సన్నని నూలుపోగులతో నేయబడినవిగను ముడతలు లేకుండినవిగను మెత్తగను సాంబ్రాణి, గుగ్గిలము, అగరు, ఆవాలు, ఇంగువ మొదలగు ధూపద్రవ్యములు (Antiseptics) చేత ధూపితములైనవిగను నుండవలెను.

యంత్రణ(ముడి.) భేదములు.

యంత్రణము(Fastening of bandages) గాఢబంధము, సమబంధము, శిథిలబంధము నని మూడువిధములు.

గాఢబంధము.

పిరుదులు, పార్శ్వములు, చంకలు, నాభికి దిగువప్రదేశము, స్తనములు, తలచుట్టు, స్త్రీప్రదేశముల గాఢబంధము వేయవలయును.

సమబంధము. చెవులు, భుజము, పాదములు, ముఖము, గంఠము, బెదవులు, మేఢ్రము, అండములు, పృష్ఠము, నాభికి దిగువ, నీప్రదేశములయందు సమబంధము వేయవలెను.

శిథిలబంధము. కన్ను, సంధులు, పినిచుట్టును శిథిలబంధము (వదులుముడి) వేయవలయును.

యంత్రణవిధి సరియైనయెడల బాధల నణఁచి వ్రణము యొక్క చివరలను మెత్తచేసి యందలిరక్తమును శుభ్రపఱచి వ్రణమును మానునట్లుచేయును. బంధనము లేనియెడల వ్రణము మశకాదులచే దష్టమై దుమ్ము మొదలగువానిచేఁ గప్పఁబడి వాపును గలుగంజేయును. ఇదిగాక శీతాతపాదులచే దుష్టవ్రణముగనైన మాఱును. చికిత్సకై యుపయోగించిన లేపము లెండి బాధను గలుగఁజేయును. రాలియైనను బోవును. కాన జాగరూకుఁడై బంధనవిశేషములను జక్కఁగ నభ్యసింపవలయును.

ఆచార్యానుశాసనము. బాహ్యాభ్యంతరావయవములను బ్రత్యక్షమునఁజక్కఁగఁ బరీక్షించుటచే లక్ష్యలక్షణములయం దారితేరి సందేహనివృత్తిగలవాఁడు, ఆయుర్వేదమునఁ బారంగతుఁడై రోగనివారకమైన చికిత్సలం జేయుట కర్హుఁడగును. కాన శుచిగలిగి తలను గోళ్ళను బెంచక ధౌత

వస్త్రాదులధరించి భూతదయగలవాఁడై స్వాయత్తీకృతజ్ఞానమును బరీక్షావిధులచేతను దృష్టకర్మములచేతను దృఢపఱచుకొనవలసినది. అట్టిజ్ఞానమును బొందిన పిదపఁ బ్రవచనశక్తిని శాస్త్రవిషయక భాషాసౌష్ఠవమును సంపాదింపఁ బ్రయత్నింపవలసినది, అనంతరము, రాజాజ్ఞనుబొంది విశిఖానుప్రవేశమును (వైద్యవృత్తియందుఁ బ్రవేశించుటను) జేయవలెను.

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు ఎ. వి. ఎస్.

వారిచే విరచితమగు

ఆ యు ర్వే దాం గ శ ల్య తం త్ర ము

ప్రథమభాగము సమాప్తము.

---

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాల

## నియమములు.

---

ఆయుర్వేద వైద్యగ్రంథములను అందలి ప్రత్యేక ప్రత్యేక విషయములనబరగు శస్త్ర, గర్భిణి, రసాయన, ఓషధితత్త్వము, మొదలగు కొన్నిటిని నితరవైద్యపద్ధతులతోఁ జక్కగఁజర్చించి యాంధ్రభాషలో గ్రంథములుగ వ్రాసి ముద్రించెదను.

గ్రంథమాలయందలి గ్రంథములన్నియు జనోపయోగముకొఱకై ముద్రింపబడుచున్నందున సులభమైన వెలలకు నీయఁబడును.

ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలో బ్రచురింపఁబడు గ్రంథములన్నియు గైకొనుటకు నొప్పుకొనువారు శాశ్వతపు జందాదారులుగ నెంచఁబడుదురు.

శాశ్వతపుఁ జందాదారులకు మాగ్రంథమాలలోని మాధవనిదానమునకు తప్ప మిగిలిన గ్రంథములన్నిటికి నియమించిన ఖరీదులలో నొకరూపాయకు నాలుగు అణాలవంతునఁ దగ్గించి యిచ్చెదను.

శాశ్వతపుఁ జందాదారులుకానివారికి నిర్ణీతమగు వెలలకు నేమాత్రము తగ్గింపఁబడదు.

శాశ్వతపుఁ జందాదారులుగాని, శాశ్వతపుఁ జందాదారులు కానివారలుగాని యంచెకూలి (వి. పి. ఛార్జి) వగైరాలు భరింపవలెను.

మా గ్రంథమాలకు శాశ్వతపుఁ జందాదారులుగ నుండువారు ముందుగాఁ జందాధనమును నియ్యనక్కఱలేదు.

పుస్తకములు ముద్రణమైనతోడనే ముందుగఁ దెలియఁజేసి యాయా గ్రంథములను వి, పి. గాఁ బంపెదను.

శాశ్వతపుఁ జందాదారులుగఁ గాఁదలచినవారు ప్రవేశము రుసుము క్రింద రు. 0—2—0 ల పోష్టుబిళ్లలను బంపుచు నిందుఁగనఁబఱచిన ప్రకారము గ్రంథమాలాధిపతులకు నుత్తరమును వ్రాసికొనవలయును.

అట్లు ప్రవేశము రుసుమును ముందుగాఁబంపక పుస్తకములను గోరు వారికి ముందుగాఁ బంపెడు పుస్తకముల వీఁపీలో 2 అణాలను జేర్చి వసూలు చేయఁబడును.

---

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలలోని ప్రథమకుసుమము

# మాధవనిదానము.

---

“ప్రతిమనుజునివద్ద నుండదగిన వైద్యగ్రంథము.”

ఈగ్రంథము మధుకోశ, పంజికా, ఆతంకదర్పణాద్యనేక వ్యాఖ్యాతల యభిప్రాయములతోఁడను. చరక సుశ్రుత వాగ్భటాదుల మతానుసారము గాను మాచేత భాషాంతరీకరింపబడినదై, నిదానదీపిక యను నాంధ్రవ్యాఖ్య తోఁగూడిన మాధవనిదానము సిద్ధముగానున్నది. వైద్యుల సహాయములేకనే సులభముగ వ్యాధులను గుర్తించునటుల జేయుటయందు దీనిని మించిన గ్రంథ మింకొకటిలేదు. జ్వరము, అతిసారము, పాండు, నంజు, మొదలగు 100 ప్రధాన వ్యాధులయొక్కయు, వాని అంతర్భూతములగు 1000 రోగములయొక్కయు పుట్టుటకుకారణములను, అవి రాబోవులక్షణములను, వాని నిజస్వరూపములను, ఇట్టి యనేక విషయములన్నింటిచే రోగముల నిశ్చయించుట ఈగ్రంథము విపులముగ సూచించుచున్నది. మరియు శాస్త్ర మర్యాదను దెలుపు మంచి పీఠికయు సంస్కృతభాషతోఁకూడిన రోగముల పేరులకు తెనుగు ఇంగ్లీషు పేర్లును వివరముగ సర్వజనోపయోగముగ వ్రాయబడి మంచి గ్లేజుకాగితముల మీద ముద్రింపబడి సుమారు 600 - పేజీలుకలిగి చక్కని కాలికోబైండు చేయబడియున్నది.

వెల పోష్టుఖర్చులుగాక రు. 3-0-0.

---

### ద్వితీయ గుచ్ఛము

# పథ్యాపథ్యము.

ఈ గ్రంథమునందు ప్రతిరోగియు నాచరింపదగిన పథ్యములగు నన్నము, కూరలు, పప్పులు, మాంసరసములు, శరీరవ్యాయామములు, వీనిలో నాచరింపగూడని యపథ్యములును మఱియు నాయా చికిత్సావసరముల పథ్యాపథ్యములగు వస్తి వమన విరేక స్వేద ప్రతిసారణాదిక్రియలయొక్క వివరణమును, రోగములు రాకుండ ఆరోగ్యముగనుండుటకై వసంతాది ఋతువులయందు నాయా ఋతుధర్మములననుసరించి యాచరింపదగిన యాహార విహారాది హితాహితములను బోధించెడు "వివరణ" మను నాంధ్రటీకతోడ ముద్రించియున్నది.

చందాదారులకు పోష్టుఖర్చులుగాక రు. 0-12-0.

ఇతరులకు ,, ,, 1-0-0.

### మూడవగుచ్ఛము

# ఆయుర్వేద పరిభాష.

ఇయ్యది హిందూవైద్యులకు జ్ఞాననేత్రమువంటిది.

ఈపుస్తకము చేతనున్నయెడల వైద్యశాస్త్రమున సందేహము గలుగదు.

కషాయ కల్క, తైల, ఘృత, ఆసవ, అరిష్ట, మోదక, రస, రసాయనాదులు జేయువిధములను వానియందు జేర్పదగు ఓషధులు మొదలగువాని పరిమితిని, (అనగా తూనికెను) దెలియజేయు మానపరిభాషలను, ఆహారము

నకు యోగ్యమగు ద్రవాఽద్రవాహారములను బోధించు పరిభాషలను; ఓషధు లలో గ్రహించదగు నియమములను; పంచపల్లవ, పంచభద్రము మొదలగు సాంకేతికములును; వమనౌషధ, రేచనౌషధ, వ్యవాయౌషధ, వికాసౌషధాది భేదములను; స్వేదన, ఆశ్చోతనము మొదలగు కర్మలయొక్క భేదముల వివరమును అభావ ప్రతినిధివస్తువులను సూచించు పరిభాషలను వివరముగ జెప్పంబడియున్నయవి. ఈగ్రంథమును జదివినమీద యిందలి వుపయోగము అందరికి జక్కగ గోచరమగును.

చందాదారులకు పోష్టేజిగాక రు. 1-2-0.
ఇతరులకు ,, ,, 1-8-0.

---

# ఆయుర్వేద (చరిత్ర) ము.

ఆయుర్వేదవైద్యము ఏకాలమునుండి ఆరంభమైనదియు, అందు ఏయే విషయములుగలదియు, వానివిభాగములును, అక్కాలమునగల శస్త్రవైద్యము యొక్క అభివృద్ధియు, ప్రకృతకాలమున భరతఖండమునందు ఆయుర్వేద మెట్లభివృద్ధికి దెచ్చుకొనవలసినదనియు ఇందు చక్కగ చర్చింపబడియున్నవి.

చందాదారులకు పోష్టుఖర్చులుగాక రు. 0-3-0.
ఇతరులకు ,, ,, 0-4-0.

---

# అగస్త్యవైద్యము.

ఇందు దక్షిణదేశమున నభివృద్ధిగాంచిన యగస్త్యవైద్య సంప్రదాయము దాని ప్రాచీనత మొదలగునవి వివరముగ దెలియగలవు.

చందాదారులకు వెల అణాలు 3.
ఇతరులకు ,, 4.

# శల్యతంత్రము.

(ఆయుర్వేదీయ శస్త్రచికిత్సాభ్యాసాదివిధి..)

దీనిని కనిపెట్టినరీతి ప్రాచీనత శస్త్రచికిత్సల స్వరూపము యంత్రములు శస్త్రములు వానిని బట్టుకొనురీతి వానిచే చేయదగిన శస్త్రకర్మభేదములు బంధనములు చరిత్రకారుల యభిప్రాయములు మొదలగునవి విపులముగ చర్చించబడినవి.

చందాదారులకు వెల అణాలు 3.

ఇతరులకు ,, 4.

---

# వస్తికర్మ.

(ఇనిమా లేక పిచికారి.)

చరిత్ర వస్తిస్వరూపము అందు గొట్టముల భేదములు నిరూహ అనువాసన వస్తిభేదములు అందుజేరు వస్తుపరిమితి అర్హులు అనర్హులు వస్తివినియోగము ప్రచారము అభివృద్ధి మొదలగు విషయములను ఆంగ్లవైద్యమునందలి వస్తివిధమునకంటె నియ్యది అధికమని నిరూపించుట ఇత్యాది విషయములు గలవు ముఖ్యముగ దేశీయవైద్యులు చూడదగినది.

చందాదారులకు వెల అణాలు 3.

ఇతరులకు ,, ,, 4.

పై మూడుపుస్తకములు నొక్కటేసారి చందాదారులకు ఈ ఏప్రియల్ మాసాంతమునకు బంపబడును.

# అర్క ప్రకాశిక.

ఇందు ద్రావకముల జేయు ప్రక్రియలు మెండు అతిసులభముగ ప్రతి వస్తువునుండి ద్రావకముల దీసికొనవచ్చును. ఆంధ్రజనులు దీనినుండి ద్రావక సంబంధములగు ననేకవిషయముల దెలుసుకొనగలరు. రాగల మేమాసాంతమునకు సిద్ధమగును.

త్వరలో వెలువడును. త్వరలో వెలువడును.

# చరకసంహిత–సుశ్రుతసంహిత.

ఆయుర్వేదవైద్య సంప్రదాయములు యేమాత్రము దెలియక యిచ్చవచ్చినట్లు వ్రాయబడిన తెనుగు టీకలవలెగాక సంప్రదాయ సిద్ధముగ అనేకతడవలు పాఠములు జెప్పియు జదివియు అనేక వ్యాఖ్యాతల యభిప్రాయముల ననుసరించియు అనుభవజన్యమగు స్వాభిప్రాయములను జేర్చియు విపులముగ తేటదెనుగున వ్రాయబడిన ఆంధ్రవ్యాఖ్యతోగూడిన చరక - సుశ్రుతములు విస్తారమగు నుపోద్ఘాతములతోడను ముద్రణము త్వరలో పూర్తియై ఆంధ్రసోదరులకరంబు లలంకరించును.

అందు సుశ్రుతము యంత్రములు, శస్త్రములు, శారీరకసంబంధమును ప్రసవసంబంధమగు చక్కని ప్రతిములను జేర్చిన షుమారు మున్నూరు పతిమలతోను కూడియుండును.

# శారీరము.

---

## Physiology. ( ఫిజియాలజి )

ఇయ్యది చిరకాలముగ మా ఆయుర్వేదిక్ కాలేజియం దనాటమీ ఫిజియాలజీ బోధకులచే విరచితము. చర్మము, రక్తము, ఎముకలు, మాంస కోశము మొదలగువానిని బోధించు చిత్రప్రతిమలు షుమారు మున్నూరుగలవు.

ఆయా భాగములయందలి సాంకేతిక పదములకు ఆయుర్వేద వైద్యక సంస్కృతపదములును ఇంగ్లీషు పదములును వివరముగ సూచింపఁబడెను.

ఇంగ్లీషు రాని ప్రతివారికిని మఱియు భాష తెలిసిన ప్రతిమనుజునికి మిక్కిలియుపయోగము. శైలి సులభము.

ఇట్టి గ్రంథమిదివరకు ఆంధ్రభాషయందు లేదు.

---

సంస్కృతాక్షరములతో ముద్రింపఁబోవు

# ఆయుర్వేద గ్రంథములు.

| | |
|---|---|
| ఆయుర్వేదసూత్రములు. | యోగానందనాథ విరచిత వ్యాఖ్యానసహితము. |
| భేడసంహిత. | మహర్షి భేడవిరచితము. |
| కల్యాణకారకము. | ఉగ్రాదిత్యాచార్య విరచితము. |
| యోగశతకము. | వరరుచివిరచితము (వ్యాఖ్యాసహితము) |
| ప్రశ్నోత్తరరత్నమాల. | అగ్నివేశ పునర్వసు సంవాదరూపము. |
| భేషజకల్పము. | చన్దనాచార్య వ్యాఖ్యాసహితము. |
| వాగ్భటమండనము. | పండితభట్టు నరహరివిరచితము. |

| | |
|---|---|
| చారుచర్య. | భోజమహారాజ విరచితము. |
| ఆయుర్వేదసారము. | రేవణసిద్ధవిరచితము. |
| ఆనందకందము. | మన్థానభైరవసిద్ధ విరచితము. |
| కాశ్యపసంహిత. | మహర్షి కశ్యపవిరచితము. (అతిప్రాచీనము) |
| శివతత్వరత్నాకరము. | కేరళిబసవరాజ విరచితము. |
| భేషజతర్కం. | ప్రాచీనము. |
| రసప్రదీపము. | ప్రాచీనము. |
| నాడీతంత్రము. | ప్రాచీనము. |

మొదలగు గ్రంథములు అనేక గ్రంథముల సాహాయ్యమువలన నాయుర్వేదాశ్రమ పండితులచే జక్కగా బరిశోధింపంబడి ముద్రణమునకు సిద్ధముగ నున్నయవి.

మఱియుఁ బైగ్రంథములుగాని యింక నితరవైద్య గ్రంథములుగాని యెవరివద్దనైన నుండినయెడల మాకార్యాలయమునకు దయతోఁ బంపిన వందనములతో నందుకొని మాపుస్తకములతో సరిమారుకొని పంపెదను.

మఱియు ముద్రణానంతరము ముద్రితమగు నొక గ్రంథమునుగూడ నుచితముగ బంపెదను.

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్లు,
ఎ.వి.ఎస్., ఎ.ఎమ్.బి.,
ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్పన్ వీధి,
జి. టి. మదరాస్.

టెలిగ్రాఫ్ అడ్రసు
"పండిట్" మదరాస్.

ఆయుర్వేద ముద్రాయంత్రమున ముద్రితము, మదరాస్.

శ్రీరస్తు.

భరతఖండమునందలి కలకత్తా, బొంబాయి, బనారస్,
మొదలగు పట్టనములయందు జరిగిన చిత్రవస్తు మహాప్రదర్శనములయందు
బంగారు పతకములను, మొదటితరగతి యోగ్యతాపత్రములను
శ్రీ శ్రీ శ్రీ గద్వాలమహారాణిగారినుండి మహామారినివారకౌషధములకై
బంగారు పతకమును బొంది
శ్రీమత్పంచమజార్జిచక్రవర్తి సార్వభౌమునిచే "వైద్యరత్న" యను
బిరుదమునుబొందిన ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి

# పండిత డి. గోపాలాచార్యులు, ఎ. వి. ఎస్.,

గారిచేత, శాస్త్రోక్తముగ తయారుచేయబడిన

# ఆయుర్వేదీయౌషధములు.

ప్రమేహభంజని:—మధుమేహము, బహుమూత్రము అను క్రూర వ్యాధులను బోగొట్టి, యెట్టియవస్థలోనయినను రోగికి శ్రమ నివారణమును కలుగజేయుటకు నిశ్చయమునయిన యౌషధము. ఈ యౌషధమువలన గుణమునుగాంచిన గొప్పవారనేకులు దీనివలన తమకు కలిగిన అధిక ప్రయోజనమును కృతజ్ఞతాపూర్వకముగ నొప్పుకొనుచున్నారు. వెల రు. 2—8—0.

వజ్రదంతచూర్ణము:—ప్రతిదినము దంతధావనము జేసినయెడల దంతములనుండి రక్తము కారకుండజేసి, దంత సంబంధమగు నితరవ్యాధులను నిర్మూలముచేసి దంతమూలములకు మిగుల దారుఢ్యము గలుగజేయును.

డబ్బా 1-కి 4 అణాలు.

వృష్యయోగము:—వీర్యవృద్ధినిచ్చి బలమును కలుగచేయుటయందు ఉత్తమోత్తమమయినది. మెదడునకు మెదడునందుండు నరములకును ప్రధానాద్యవయవములకును పటుత్వమును, రక్తవృద్ధిని, దృఢబలమును కలుగజేయుటయందిది సంజీవివంటిది. వె. డబ్బా 1-కి రు. 1—0—0.

పూజ్యపాదవటి:——నరముల నొప్పులను నరముల ఈడ్పులను పక్షవాతములను, చచ్చువాతములను, నిర్మూలముచేయును. హృదయమునకు మిక్కుటమగు బలమును గలుగజేయును. వెల సీసా - 12 - అణాలు.

పంచానన లేపము:——ఈ యౌషధము తామరను శుభ్రముగపోగొట్టి విడవకుండ నుపయోగించినయెడల, తిరిగి యెప్పటికి పొడచూపకుండచేయును.
వెల డబ్బా 1-కి 8-అణాలు.

సుఖవిరేచనవటి:——మాత్ర మినపగింజకంటె నధిక ప్రమాణముండదు అసహ్యము లేకుండ సేవించదగినది. మలబద్ధకమును నివారించును. పసిబిడ్డలు కూడ నుపయోగింపనగును. వెల సీసా 1-కి 8-అణాలు.

అజీర్ణపంచాననము:——అజీర్ణమువల్ల కలిగెడు అనేక వ్యాధులలో జ్వరము, నిద్రలేకపోవుట, రొమ్ములో బరువు, నిస్త్రాణ, బలహీనము, కడుపు నొప్పి యనునవి పోగొట్టుటకు రాజౌషధము. వెల డబ్బా 1-కి రు. 1.

తాంబూలవటి:——ప్రతిదినము తాంబూలముతో నుపయోగించుట కుద్దేశింపబడినది. మిక్కిలి బలమును కలుగజేయుటయేగాక, తాంబూలమునకు రుచిని పుట్టించి నోటిదుర్గంధమును పోగొట్టి, కంఠనాళములకును స్వరమునకును జీర్ణశక్తికిని సహాయముచేయును. 50 మాత్రలుగల సీసా 8-అణాలు.

కేశప్రసాదతైలము:——శిరస్సు చల్లపడునట్లు చేసి వెంట్రుకలు ఊడిపోకుండ పెరుగుటను వృద్ధిచేసి, అకాలమున నెరవకుండునట్లుచేయును. మెరుగునూనెలకు బదులు దీని నుపయోగించుటచే కలిగెడు లాభము అసదృశము. వెల సీసా 1-కి రు. 1.

భృగువటి:——రెండురోజులలో శగరోగములను పోగొట్టి మర్మస్థానమునుండి విషజల స్రావము నాపును. దీర్ఘకాలమునుండి బాధించుచున్న వ్యాధియందు వారముదినముల సేవవలన రోగిని మిక్కిలి మంచిస్థితికి తెచ్చుట నిస్సంశయము. వెల 24 మాత్రలుగల సీసా 1-కి రు. 1—8—0.

చంద్రకల:——ఒంటికణతనొప్పులు, అన్నివిధములగు తలనొప్పులు, పడిశము, రొమ్ముపడిశము, కళ్లె, దగ్గు, సామాన్యవాపులు, కీళ్ళవాపులు మొదలగు వాటియందు దీనినిరుద్దినతోడనే, బాధ మాయమగును. ఇది ప్రతి యింటనుండదగిన కుటుంబౌషధము. వెల బుడ్డి రు. 0—8—0.

అశోకవటి:—స్త్రీల దురవస్థలను తొలగించుటకు అమూల్యమయిన యౌషధము. ఋతు సంబంధముగా, నొప్పులను, ఇతరజబ్బులను, రజోగర్భాశయములు జెడుటవలన నేర్పడినవ్యాధులను మొదలంటు రూపుమాపుటలో నిస్సందియము. వ్యాధినివారణమయినపిదప గర్భోత్పత్తియు సుఖప్రసవమును ఈ యౌషధ సేవవలన నేర్పడుచున్నవి. వెల సీసా 1-కి 12-అణాలు,

రక్తశోధక:—సవామేహములచేతను, రసదోషములచేతను, యింక ననేక కారణములచేతను, చెడిపోయిన రక్తమును శుభ్రపరచును. కురుపులు, చీడ, తామర, మేహపొడలు, మొదలగు చర్మదోషములను నిర్మూలము జేయును, నోటిపూతలను, అపుడపుడువచ్చు కంఠకలకను బోగొట్టును.
వెల బుడ్డి రు. 2—8—0.

అబలాసంజీవిని:—(స్త్రీలకుగలుగు మదమూర్ఛలకు సిద్ధౌషధము) యువతులగు స్త్రీలకు ననేక కారణములచే గలుగు అపస్మారములను, మూర్ఛలను, గర్భాశయదోషములను, పలువిధ మనోవికారములను, బోనణచును. గర్భిణీ స్త్రీలు దీనిని సేవించిన గర్భాశయమునకు మిక్కిలి బలమును, సుఖప్రసవమును, గలుగంజేయును, మఱియు, ఇయ్యది స్త్రీలకేకాక మనుజసామాన్యముగ సంభవించు మూర్ఛలను అపస్మారములనుకూడ నశింపజేయును.
వెల బుడ్డి రు. 1—8—0.

వృశ్చికదంశ నివారిణి:—తేలుకుట్టినచోట దీనిని రుద్దినయెడల, 5 నిమిషములలోనే కుట్టినచోటకూడ బాధలేకుండునట్లు జేయునని అనేకవేల మహనీయులు గొనియాడుచున్నారు. వెల బుడ్డి 0—8—0.

జంబీరరసాయనము:—(పైత్యములకు మంచిది.) నోట నీళ్లూరుట, తలతిరుగుట, రొమ్మునొప్పి, రొమ్ములోమంట, కడుపులో త్రిప్పుట, వాంతియగుట, పసరువెళ్లుట—ఈ మొదలగు పైత్యవికారములకు మిగులమంచిది. మఱియు, పైత్యాజీర్ణములకు, మిక్కిలి గుణకారి. వెలబుడ్డి రు. 0—8—0.

చ్యవనప్రాశన:—ఉబ్బసము దగ్గులను, క్షయదగ్గులను, సామాన్యపు పొడిదగ్గులను, రొమ్ముపడిశము వలన కఫము జాస్తిగానుండుటను, నివర్తి జేయును. రొమ్మునకు, ఊపిరితిత్తులకు బలమును కలిగించును. క్షయరోగులంతటివారి కసమానపుష్టిని శరీరమునకు శక్తినికలిగించును. బాలురును, వృద్ధులు

నుగూడ సేవించదగును. బలమునకు దీనికొను చాపనూనెకంటె (Cod liver Oil) వేయిరెట్లు పనిజేయును. ఉబ్బసమువగయిరాలను రాకుండ కాపాడును.

వెల టిన్ను రు. 2—8—0.

అశ్వనివటి:—ప్రతిదినము వచ్చెడి జ్వరములను, దినమువిడిచి దినము వచ్చెడి జ్వరములను, వర్షాంతములవరకు విడువని జ్వరములను, బల్లలతోకూడిన జ్వరములనుకూడ నతిశీఘ్రములో మాయము జేయును. వెల బుడ్డి రు. 0-12-0.

మకరధ్వజ:— రోగసామాన్యములను రాకుండ జేయుటయందును, అనేకకారణములచేత బలహీనతనొందిన వారికి బలమును కలుగజేయుటయందును, హిందూవైద్యశాస్త్రమున నింతటి ఖ్యాతిగలమందు వేరొకటిలేదు. నియ్యాది, బంగారు మొదలగు మిక్కిలి విలువగల పదార్థములచేత తయారు చేయబడినది. వెల తు 1-కి రు. 24—0—0.

7 డోసులమందు రు. 1—0—0.

సిద్ధ మకరధ్వజ:—పై మందువలనే, అత్యధికమగు బలమును, మెదడుకు నరములకు శక్తిని కలిగించును. మరియు నపుంసక దోషములనుకూడ బోగొట్టును. నియ్యాది, ముత్యములు, బంగారు, మరియు యితర లోహములతో చేయబడిన యమూల్యౌషధము. వెల తు 1-కి రు. 80—0—0.

7 రోజులమందు రు. 5—0—0.

నారాయణతైలము:—పక్షవాతములు, చచ్చువాతములు, కీళ్ళనొప్పులు, వాపులు, శిరోవాతములు, దీనిని పైన రుద్దుటచేత నిర్మూలము చేయును. వెల బుడ్డి రు. 2—8—0.

నాడీవ్రణాంతక:— నారికురుపులకు వజ్రాయుధమువంటిది. గొప్పవారనేకులు దీనిని యుపయోగించి దీనిపేరు సార్థకమనిరి.

వెల బుడ్డి రు. 0—12—0.

మాతులుంగరసాయనము:—(గర్భిణీ స్త్రీలకు సంజీవి) గర్భిణి స్త్రీలకు అనేక కారణములచే సంభవించు వాంతులు మొదలగు వ్యాధులను, బలహీనమును బోనడచును, మరియు గర్భాశయమునకు బలమును కలుగజేయును. అధికప్రయాసచే ప్రసవించెడి స్త్రీలకు, బాధయనునది దెలియకనే సులభముగ ప్రసవముజేయుటలో, గర్భిణి స్త్రీలపాలిటికి సంజీవనియైనదియే.

వెల బుడ్డి రు. 1—8—0.

వ్రణరోపణి:——గజ్జి, చీడ, పాసినపుండ్లు, కాలినపుండ్లు, వీనిని నిస్సంశయముగ నిర్మూలముజేయును. వెల డబ్బా ర 0—4—0.

వసంత కుసుమాకరం:——బహువిధ మూత్రవ్యాధులకును, మూత్ర మందలిగల తీపు దోషములకును, ఆర్యవైద్యశాస్త్రియున సుత్తమతమౌషధమని ఘంటాపథముగ జెప్పంబడుచున్నది. మఱియు, మధుమేహ బహుమూత్ర వ్యాధులచే గలుగు రోచ కురుపులను రాకుండజేయును. గుండెకాయ కును, నరములకును, బలమునిచ్చుటలో దీనికి సరిపోల్చుటకు వేరొకయౌషధము మాకు గోచరముగాకున్నది,

వెల తు 1-కి రు. 30—0—0; 7 రోజులమందు రు. 5—8—0.

ఆత్రేయవటి:——కీళ్ళనొప్పులు, సవామేహవాతనొప్పులు, కీళ్ళవాపులు మొదలగు వానిని, విశేషకుండెడు దీర్ఘకాలపు నొప్పులనుకూడ రూపుమాపును. వెల బుడ్డి రు. 0—12—0.

బాలసంజీవనివటి:——ఈ మాత్రలను ప్రతి నిత్యము రేపుమాపువకటి చొప్పున యుపయోగించిన, అజీర్ణములు, దోమువిరేచనములు, జలుబు, దగ్గు, జ్వరము, మొదలగునవి రాకుండయుండును. వచ్చిన నిర్మూలము జేసి ఆరోగ్యమును గలిగించును. పసిబిడ్డల సంరక్షణకుగాను ప్రతికుటుంబమున నుండదగినది.

వెల 50 మాత్రలుగల సీసా 1-కి రు. 0—8—0.

విచిత్రరత్న లేపం:—— చాలాకాలమునుండి పీడించెడు సవాయి పుండ్లు, కొరుకుపుండ్లు, భగందర వ్రణములు, గండమాలా వ్రణములు, ప్రధానావయవమందలి వ్రణసామాన్యములు, స్త్రీల మర్మస్థలములయందలి వ్రణములు, మేహవ్రణములు, మొదలగువానిని శీఘ్రములో గుణముజేయును.

వెల డబ్బా 1-కి రు. 1—8—0.

కదళీకందపాకం:——రక్తవిరేచనములను, నోటివెంట, ముక్కువెంట పండ్లవెంట రక్తముపడుటను, రక్తవమనమును, రక్తకుసుమమును, శరీరతాపమును, ఎదురురొమ్ము అరకాళ్లు అరచేతుల మంటలను, మూత్రనాళమందలి పోట్లు మంటలను బోనణచును. సెగరోగులకుగల మూత్రపు చురుకునకును చాలామంచిది. పసిబిడ్డల కారకములకు సంజీవనియె!

వెల టిన్ను 1-కి రు. 1—8—0.

మృగమదవటి:—కస్తూరి మాత్రలుగల ఒక ఈసీసా ప్రతికుటుంబములో నుండవలసియున్నది. సకాలములో నీ మాత్ర లుపయోగింపబడిన యెడల జ్వరముసురాకుండ జేసికొనవచ్చును, మరియు జలుబు, రొమ్ముపడిశము, సన్నిపాతములను బోగొట్టును. వెలసీసా 1.కి రు 1.

సిద్ధగంధక రసాయనమ్:—రక్తశుద్ధిని చేయుటయందీ యౌషధము నంగల అత్యద్భుతమగు గుణమునుబట్టి చర్మవ్యాధులు కొద్దిరోజులీ యౌషధ సేవవలన నివారణమగుచున్నది. ఏకదినముల యౌషధమునకు వెలరు. 2-8-0

వాశారిష్టం:—జలుబుతో కూడినట్టిగాని, జలుబులేనట్టిగాని ఉబ్బసములను నశింపజేయును. క్షయరోగులకు, రొమ్ముపడిశములకు, ఊపిరితిత్తులకు జేరిన ప్రతివ్యాధికిని, రక్తపిత్తమునకును, రత్నమువంటిది.

వె॥ బుడ్డి రు. 1—0—0.

సారణపాకం:— రక్తముతో కూడిన మూలశంఖను అత్యద్భుతముగా కుదుర్చును. మరియు మొలలతో కూడిన మూల జాడ్యమును కొంతకాలము సేవించిన నివర్తిజేయగలదు. వెల టిన్ను రు. 2—0—0.

స్వర్ణక్రవ్యాదరస:— చిరకాలమునుండియున్న అజీర్ణవాతములకు అమ్లశైత్యములకు అసమానమైనది. కడుపుబ్బరములను, పులితేపులను, బోనణచును. 7 రోజులమందు రు. 4—0—0.

స్వర్ణవంగం:—శుక్లనష్టములకు, స్వప్నస్ఖలనములకు, సంజీవివంటిది. మరియు చిరకాలపు శగరోగములను ధ్వంసముచేయును.

7 రోజులమందు వెల రు. 4—0—0.

చందనబలాలాక్షాతైలము:—ఉబ్బసరోగము, క్షయరోగము, పురాణ జ్వరములు, పాండు, తలనొప్పులు, శిరోవాతములు, శరీరతాపము, ఉదుకు— ఇవియన్నియు, ఈతైలముచే నొకటిరెండుతడవలు అభ్యంజనము చేసుకొనిన గుణమగును. వెల బుడ్డి రు. 2—0—0.

ఖండకూశ్మాండలేహ్యము:—ఎండిపోవు శరీరస్వభావముగల బిడ్డలకు పెద్దలకును మాంసమునకు పుష్టిజేయును. క్షయము, ఉబ్బసము, పొడిదగ్గు, కలవార్లకు మిగుల మేలుజేయును. ఊపిరితిత్తులకు మంచి బలమును గలుగజేయును. వెల టిన్ను 1-కి రు. 2—8—0.

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

ఎ. వి ఎస్., ఎ. ఎమ్. బి., వారి

---

## జీవామృతము.

హిందూదేశమందలి మంచిమూలికలచే
తయారుచేయబడినది.

రక్తమును వృద్ధిజేయును
మేహవాతనొప్పులను బోగొట్టును
అన్నివిధములగు బలహీనములను అణచును
పాండురోగులకు మంచిది
గుండెదడను నివారణజేయును
గర్భకారకములను దరుమును
బాలులకు గర్భిణీలకు నుత్తమము
చనుబాలను వృద్ధిబరచును
మూర్ఛలకు మంచిది
మెదడుకు బలము గలుగజేయును
నరములకు శక్తిని హెచ్చించును
విద్యార్థులకు ప్రాణమిత్రము
ప్రాణశక్తిని హెచ్చించును
క్షయరోగులకు మిగుల మంచిది
కాసరోగులకు అమృతము
గుండెకాయకుమిక్కిలి బలమునిచ్చును
ఊపిరి తిత్తులకు అధిక బలముజేయును
ఉబ్బసరోగులకు మిగులహితము

వెలబుడ్డి 1-కి రు. 3-0-0.
12 బుడ్లు వెల రు. 34-0-0.
ప్యాకింగు పోస్టేజి వేరుగా
నివ్వవలెను.

## అమృతామలకతైలం

శిరస్సునకండ్లను సర్వదా కాపాడును
అన్నివిధ శిరోరోగములనుబోగొట్టును
పార్శ్వనొప్పులను దూరముజేయును
కణతనొప్పులను నిర్మూలముజేయును
పీనసరోగముల రానివ్వదు
మెదడుకు బలముజేయును
కర్ణరోగములను నశింపజేయును
కండ్లకు చలువజేయును
అపస్మారముల దూరముజేయును
తలనరములకు బలమునిచ్చును
నేత్రరోగములకు హితము
మూర్ఛలను బోగొట్టును
తలమండును బోనణచును
వెంట్రుకలను నెరయకుండజేయును
విద్యార్థులకు సర్వదా హితము
వెంట్రుకలను పట్టుకుంచవలెబెంచును
యోచనజేయువారికి మిక్కిలి హితకరము
మాడుపోట్లను నిర్మూలముజేయును
చర్మరోగులకు మంచిజేయును
తలమంటలను మాన్పును
అధికనిద్రను తగ్గించును
నిద్రలేమిని బోగొట్టును
దీనిగుణములను అనుభవజ్ఞులకు తెలుసును

వెల బుడ్డి 1-కి అణాలు 12.

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు

ఎ. వి. ఎస్. ఎ. ఎమ్. బి., వారి

## ప్లేగుమందులు.

**మహామారి (ప్లేగు) నుండి ఎంతమాత్రము భయములేదు**

శ్రీ గద్వాల మహారాజుగారి మెప్పుచే బంగారు పతకమును బొందిన మాప్లేగు మందులను గడచిన పదునాలుగు వత్సరములుగ బర్మాలోను ఇండియాయందలి పలుభాగములయందును వుపయోగించి అనేక ప్రాణులు సుఖము బొందిరి.

ప్లేగుగల ప్రదేశముల దీనిని మేము చెప్పుప్రకారము సేవించుచుండిన ప్లేగు బాధ యెంతమాత్రము బాధించదు. చిన్నలు, పెద్దలు, గర్భిణి స్త్రీలకు కూడా నుపయోగించవచ్చును.

### హైమాదిపానకం.

పెద్దసీసా 1-కి రు. 1—0—0
చిన్నసీసా 1-కి 0—10—0

### శతధౌతఘృతం.

పెద్దసీసా 1-కి రు. 0—12—0
చిన్నసీసా 1-కి 0—8—0

## కలరామందులు.

మాకలరామందులు అనేక మ్యునిసిపాలిటీల వారిచేత బొగడబడియున్నవి.

ఈరాజధానిలో నీకలరావ్యాధికై నుపయోగించెడు మందులలోనెల్ల మా కలరామందులు శ్రేష్ఠమైనవని ఖ్యాతి వహించెను.

మామందులుకలచోట కలరా లేదనియే నమ్మవచ్చును. మేము అనేకవేల జనులకు యిచ్చిచూచి దీనిమహిమను దెలిసికొనియున్నాము - అనుట అతిశయోక్తిగా నెంచకూడదు. పసిబిడ్డలు మొదలు పెద్దలకును, గర్భిణీస్త్రీలకు కూడా నుపయోగించనగును. ఇతర మందులవలె మూత్రము బంధించుట మొదలగు దుర్గుణములు లేవు.

కర్పూరాద్యరిష్టం 0-8-0 }
విషూచిసంజీవని 0-4-0 } అ. 12

ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము.

## ఆయుర్వేదాశ్రమం, జి. టి. మదరాస్.

...నమః

# ...రూపులు

,, కోపమునను ఘనత ♦ కొంచెమై పోవును
గోపము ననుమిగుల ♦ గోడుసెందుఁ
గోప మడఁచెనేని ♦ గోరికలీడేరు
విశ్వదాభిరామ ♦ వినుర వేమ. ,,




సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు,
మ ద రా సు.

1913.

దీనివెల అణా 2.]

షేక్స్పియరు మహాకవి రచితమైన 'రోమియోజూలియట్' అను నాటక ప్రతికేతివృత్తము ననుసరించి

వ్రాయఁబడిన

# కమలినీ కామరూపులు

## కథయందలి పాత్రములు.

---

Romeo = కామపాలుఁడు.

Juliet = కమలిని.

Capulet = శ్రుతకీర్తి.

Montague = సోమపాలుఁడు.

Verona = వైశాలీనగరము.

Rosaline = మంజుభాషిణి.

Tybalt = జీవకుఁడు.

Friar Laurence = సదానందుఁడు.

Mercutio = కీర్తివర్మ.

Benvolio = గుణదేవుఁడు.

Count Paris = వీరవర్మ.

---

# కమలినీ కామరూపులు

భరతఖండమునందలి 'వైశాలి' యను నగర మొకటి గలదు. అందుత్తమవంశ సంభూతులగు 'సోమపాలుఁడు' 'శ్రుతకీర్తి' అను సామంత రాజు లిరువురుండిరి. వీరిలోఁ జిర కాలముగ విరోధాగ్ని యుత్పన్నమయి రగిలి ప్రజ్వరిల్లుచుండెను. ఇట్లు దినదినాభివృద్ధిఁ జెందుచున్న శాత్రవమువలన వీరి సమీపబంధువులే కాక దూరపుఁ జుట్టములును, దాసదాసీజనములును, పరస్పర విరోధములు గలిగి యొండొరులను సంధించు సమయములయందుఁ దమ విరోధములను వెలిఁబుచ్చుచు నోరారఁ దిట్టుకొనుచుందురు. మనస్సారఁ గొట్టుకొనుచు నుందురు. కొన్ని వేళల భయంకరముగా యుద్ధమాడి రక్తములు స్రవింపఁ బోరుచుకొనుచు నుందురు. ఈ కారణముచుబట్టియే వైశాలీనగర రాజమార్గములయందు సర్వదా కలహములు జరుగుచుండును.

వృద్ధుఁడైన శ్రుతకీర్తి యింట నొకానొక పండుగ దినము మిగుల గొప్పగాఁ గొనియాడఁబడెను. దానికొఱకా ప్రభువు మిగుల వైభవముగా నొకవిందు చేయఁ దలఁకొని, యారగింపునకుఁ దనకుఁ గావలసిన హితులనందఱను బిలిచెను. వాని విందునకు వైశాలీ నగరమునందలి రూపవతులగు కన్యకామణులందఱును బోయియుండిరి. వాని

యింట సోమపాలుని సంబంధించినవారు దప్ప నెవరు వచ్చినను, వారికి మర్యాద చక్కఁగా జరుగుచుండెను. ఈ విందునకు వయస్సుచెల్లిన సోమపాలునియొక్క పుత్రుఁడగు కామరూపుఁడు వరించియుండిన "మంజుభాషిణి" యను రూపవతియును బోయియుండెను.

ఆమంజుభాషిణియందు కామరూపుఁడు పెట్టియున్న యనురాగమునకు మేరయే లేకుండెను. దానివలన వానికి రేయింబవళ్లు చింతతలకెక్కి నిద్రాహార విహారములయం దిచ్ఛదొలఁగెను. ఎవరితోడను మాటలాడుటకు వాని కిష్టము గలుగదయ్యెను. కామరూపునికిఁగల మోహవ్యాపారమునకు సమముగా మంజుభాషిణికి వలపలవడదయ్యెను. అది వానిని లాఘవపఱచి సడ్డచేయక మెలఁగుచుండెను. ఇట్లుండఁగా నాదినము కామరూపుఁడు మంజుభాషిణీమీఁది మోహమును నిరాకరింపఁజాలక దాఁపుననేయున్న తన యుద్యానవనమును జేరి యొకతరువరచ్ఛాయనుండిన చంద్రకాంత శిలావేదికపైఁ గూర్చుండి —

ద్విపదలు.

ఆమంజుభాషిణి ♦ దా నాననంబు
తామరసంబని ♦ దలపోసి పోసి,
యాకాంత నయనమ్ము ♦ ల సమసాయకుఁడు
గైకొన్నతూఁపు లౌ ♦ నంచెన్ని యెన్ని,
యారాజముఖికి నో ♦ ప్పారు పాదములు
గోరికఁ జిగురుటా ♦ కులఁ బోల్చి పోల్చి,

యా సరోజాక్షికి ♦ నలరారు జంఘ
లాసమైఁ గాహళు ♦ లని యెంచి యెంచి,
పలువిధంబుల నెదఁ ♦ బలుమాఱు వగచి
వలపుచేఁ గోల్పోయె ♦ వరబుద్ధి బలము.
గినిసి మారుఁడు దన్నుఁ ♦ గీటడఁగింపఁ
దనలోన నిట్లని ♦ తద్దయుఁ బలికె.
" నాయట్టి రూపసి ♦ నాయంతభోగి
నాయంత రసికుని ♦ నాఁతి గైకొనద
పడఁతుక ననుజూచి ♦ పలుక కుండుటకు
నుడుగని సిగ్గకా ♦ నోపుఁగారణము.
నిడువాలు గన్నుల ♦ నెమ్మిదళ్కొత్తఁ
బడఁతిమాచిన జన్మ ♦ ఫల మదిగాదె "

అని తపించుచున్నప్పుడు, వీనికిఁ బ్రాణమిత్రుఁడైన గుణదేవుఁ డచ్చోటికివచ్చి, వీఁడున్నస్థితికిఁ జాల వగచువాఁ డయ్యెను. వీని కెట్లయినను హితము బోధించి, మంజుభాషిణివిషయమునఁ దగిలియున్న మోహమును మాన్పిననే కాని వీని తలకెక్కిన వెఱ్ఱి దిగఁజాలదని దలఁచి యొక యుక్తిపన్నెను. అంత నతఁడు కామరూపునిఁజూచి,

ద్విపదలు.

ఇది యేమి డస్సితి ♦ విదియేమి బ్రమసి
తిది యేమొకో మిత్ర ! ♦ యిచ్చోట నునికి
పగతుఁ డేతెంచిన ♦ వగవ వెన్నటికి
తగఁగమృత్యువుఁ గన్నఁ ♦ దలఁక వెప్పటికి.

పిడుగునైనను బట్ట ♦ బెళుక వేప్రొద్దు
తడయక ధైర్యంబు ♦ దగునయ్య వదల.
ఆచంద్రముఖిఁ గాంచి ♦ యామంజువాణిఁ
జూచి మోహించితో ♦ చోద్యంబు గాఁగ ?
నేచూపు లేతీఁపు ♦ లే విలాసమ్ము
లేచంద మాయంద ♦ మేమందు నిన్ను !
వాలారు చూపులు ♦ వాలుగన్నులును
మేలైన నడకలు ♦ మేలిమాటలును
సంగీత సాహిత్య ♦ సరసభావములు
శృంగారచేష్టలఁ ♦ జెలువొందుకనులు
నగవులు దగవులు ♦ నాగరకములు
సొగయించి వలపులు ♦ సోనగాఁ గురిసి
సురకామినులనైన ♦ సొరిదిని మీఱు
తరుణులు లేరొకో ♦ ధారుణీస్థలిని ?
చేత వెన్ననుగల్గి ♦ చిత్తంబు చెదర
నేతికి నై యేడ్చు ♦ నీవంటివాఁడు ”

కావున కామరూపా ! నీ శరీరమునకుఁ దెప్పరముగాముప్పును గలిగించునట్టి మంజుభాషిణీమోహమును మానుము. నా హితమును జెవియొగ్గి వింటివేని దప్పక నీకు మేలు గలుగఁ గలదు. సౌందర్యసౌశీల్య తారుణ్యములయందుఁ బేరెన్నికఁ గాంచిన మించుఁబోణు లెందఱో కలరు. నామాటలను విశ్వసింపవేని యొకటి చెప్పెదను వినుము. నీవు మాఱువేసమును బూని శ్రుతకీర్తియింటి కీదినము పొమ్ము. నీవు మెచ్చుకొను

చుండు మంజుభాషిణియును నాచోటికి రాఁ గలదు. ఇంకను సురూపసంపదను ప్రఖ్యాతలయిన యువతీమణులు సైతము పెక్కు అచ్చోటికి రాఁగలరు. వారితో నీచిత్తమును వ్యర్థముగా దోఁగిలిన మంజుభాషిణినిబోల్చి చూడుము. 'హా! హంసాంగనలమధ్య కాకవనిత వెలయుచున్నట్లు నీవే కనుఁగొనఁ గలవు' అనెను.

కామరూపునకు వాని మాటలయందు విశ్వాసము పుట్టలేదు. "ఎట్లయిననేమి! యాచోటికి నేనువలచిన మంజుభాషిణి రాఁగలదు. దానినిజూచు నిమిత్తమే మాఱువేసము ధరించి నా ప్రియమిత్రుఁడు గుణదేవుఁడు చెప్పినట్లు పోయెదను" అని తనలోఁ దీర్మానించుకొనెను. సూర్యుఁడస్తమించుటను గనిపెట్టియుండి, తమ తెగవారు దలచూపరాని మహాద్వేషియగు శ్రుతకీర్తి గృహమునకు మాఱువేసముతోఁ బోయిచేరెను కామపాలుఁడు.

అంతట, గుణదేవుఁడును కామరూపునితో మాఱువేసముధరించి శ్రుతకీర్తియొక్క భవనమునకుఁ బోయెను. అప్పుడు శ్రుతికీర్తి వారినెదుర్కొనిపోయి "ఘనులారా! దయచేయుఁడు. మీరాకవలన నాయింటికిఁ బవిత్రతకలిగెను. లోకమునందు సాధారణస్త్రీలు గృహకృత్యములు సేయుచుండుటవలనఁ జేతులు గాయలుకాసి సౌమ్యతకు భంగము గలిగియుండును. అట్టి వికారము లేమాత్రము లేక, సౌందర్యమునకుఁ బ్రసిద్ధిచెందిన యువతీమణులతోడ మీరీదినము కలసిమెలసి సంతోషపూర్వకములయిన సల్లాపములతోఁ

ప్రొద్దుగడుపవచ్చును. నేనుసైతము బాల్యమునందు ఇవ్విధముగానే మాఱువేసములు వేసికొని పలుతడవలకు రూపవతులగు కాంతామణులతో సంభాషించియున్నాను. అప్పుడు వారి చెవిచెంతకుఁబోయి రహస్యముగాఁ గొన్నిమాటలు పలుకుచు నుంటిని" అని యావృద్ధుఁడు వేడ్కమీఱఁ బలికెను.

వినుటకు వచ్చినవారు, దమ కుచితములయిన స్థలములుచేరి కూర్చుండువారును దమ నెయ్యురతోఁ బలుకువారునుగా వినోదించుచుండిరి. అప్పు డచ్చోటికివచ్చిచేరిన యువతీమణులలో ననుపమానయైన యొకకన్యకామణి వెలయుచుండెను. దానియసమాన సౌందర్యమును గాంభీర్యమును గాంచి మనశ్చాంచల్యముతోఁ గామరూపుఁడు, "హా! యేమి దీనిలావణ్యకాంతి! ఈకాంతివలననేకదా! ఇందలి వెలుగుచున్న యీదీప కళికల కింత శోభ చెన్నొందెను. ఈ యంధకారబంధురమగు రాత్రియందు, ఈదీప కళికలతోఁ బ్రకాశించునట్టి యీరేయియందు, ఆహా, దీనినిజూచిన యెడల, ఆకసమున నక్షత్రపంక్తికినడుమఁ దేజరిల్లు సంపూర్ణ చంద్రబింబము సైతమీడుకాదే! ఈరూపగర్వితను బొందఁ గల్గిన మహాభాగ్యవంతుఁ డెవఁడోకదా! హా, యిది యీ భూమండలమున జన్మింపఁదగినదియా? మానవస్తోమమునందిది మెలఁగుచుండుటనుగూర్చి పర్యాలోచింపఁగాఁ గొక్కెరలనడుమ రాజమరాళి వసియించునట్లుగదా కనఁబడుచున్నది.

## ద్విపదలు

ఏయింతులైన నీ ♦ యింతిఁబోలుదురె
కాయజుదంతిగాఁ ♦ గామినిపోలుదు
మెచ్చనేఁ దోలుకాఱు ♦ మెఱుఁగునుబోలె
నచ్చెరు వీపంక ♦ జాక్షి రూపంబు
అడుగుల కెంజాయ ♦ యా నఖద్యుతులు
దొడల క్రొమ్మెఱుఁగులు ♦ దోరంపుఁబిఱుఁదు
సన్నపూమధ్యంబు ♦ సొంకొంపువళులుఁ
జెన్నారులతలనఁ ♦ జెలఁగు బాహువులు
మెఱుఁగారుమోమును ♦ మీన నేత్రములు
నెఱివెంద్రుకలకప్పు ♦ నెగడుఁజేడియకు
శరములైదును జేర్చి ♦ జలజాక్షి గాఁగ
కరిగించిపోసెనో ♦ కంజజాతుండు
హరుఁడేమిసేయు ని ♦ య్యాబల వీక్షించి
హరి యేమిసేయుని ♦ యతివదర్శించి
ముదితనెపొమ్మునో ♦ ముని గెల్వనేర్చు
నదిగానఁదన రారె ♦ నధరామృతంబు
తొమ్మండ్రుబ్రహ్మలు ♦ దొడరిరో కాక
యిమ్ముగ్ధ నొకఁడుగా ♦ నెట్లుసృజించు
కమ్మపువ్వులకేఁగు ♦ గండుతుమ్మెదలు
కొమ్మకొప్పునుబోలి ♦ కొమరారవిపుడు
భామినినడుమురో ♦ భారంబుఁదాల్ప
ధీమంతుఁడజుఁడుమం ♦ త్రించెనో చూడ

బోటికినొప్పుచూ ♦ పులువిలాసములు
మాటలనేర్పులు ♦ మందహాసములు
ఎల్లమాటలిఁ కేల ♦ యీకాంతఁగన్న
తల్లిదండ్రులుసేయు ♦ తపమెన్ననాను
జలజలోచనఁదెచ్చి ♦ సంధించుపనికిఁ
గలఁడొకో నాకు ని ♦ క్కడబంధు వొకఁడు ”

అనివీఁడిట్లు మోహముదలకెక్కి పాడఁ నట్టిపాటకు శ్రుతకీర్తి ప్రభువు సమీపపు బంధువులలోఁ జేరిన పరమమూర్ఖుఁడగు జీవకుఁడు, కంఠధ్వనినిబట్టి వానిని గామరూపునిఁగా గ్రహించెను. మనయొక్క భవనమునందు నడచుచున్న యీ మహోత్సవమును సోమపాలుని పుత్రుఁడగు నీనీచుఁడు మాఱువేసము పూనివచ్చి నాశముచేసెను. అట్లువచ్చుటకాక, పరమపవిత్రయగు మన బాలికామణినిజూచి నోటికిరాని దుర్భాషలు ప్రేలుచున్నాఁడు అని కోపోద్దీపితుఁడయి త్రుళ్లిపడిలేచి కామరూపుని నొక్క వ్రేటునకే నేలఁగూల్ప యత్నించెను. జీవకుని ప్రయత్నముదెలిసి. కామరూపుని గాంభీర్యమునకును సచ్ఛీలమునకును వినయమునకును నిదివఱకే మెచ్చుకొనుచుండినవాఁడు గాన శ్రుతకీర్తి, వాని నాటంకపెట్టెను. ఇట్లు దన్ను నిర్బంధపఱిచి తన ప్రయత్నమునకు భంగమును గలిగించుటచేత జీవకుఁడు తన్నుమీఱి వచ్చిన కోపమొకవిధముగా నడఁచికొని, “మంచిది, కానిమ్ము; పిలువని పేరంటముగా నీభవనమునఁ బ్రవేశించిన పలువయగు నీ కామరూపునకుఁదగిన దండన విధించెదను.

నీ విప్పుడు దప్పిబ్రదికితివను నాబారినుండి యెట్లు తొలఁగ గలవో చూతము" అని గర్వోక్తులు పలికెను.

కామరూపుఁడు, తాను వేషధారి యైనందున నా కన్యకామణిచెంతకుఁబోయి, దానితో సంభాషించుట యొక నేరముగాఁ బరిగణింపఁ బడదని దలపోసి, మిక్కిలి వినయము ప్రకాశింపఁగా దాని చేతులను బట్టుకొని, దాని ముఖారవిందముపైఁ దన చూడ్కి నిలిపి, "ఓ యువతీమణీ! నీపాణిపల్లవమును నేనొక పుణ్యస్థలముగా భావించెదను. నేనుదానిని దర్శింపవచ్చిన యాత్రికుఁడను. కాఁబట్టి, దానిని తాఁకుటవలన నేరము గలుగదు. అట్టినాచైదము తప్పుగాఁ బరిగణింపఁబడి యపరాధము చాటఁబడెనో ప్రాయశ్చిత్తముగా నీ చేతులనే ముద్దుపెట్టుకొనెదను" అనెను. అందులకు నాయువతీమణి—

"అయ్యా, నెయ్యుఁడ! మీమాటలచేత మీరు మిగులభక్తియు సచ్ఛీలమును గలవారని దెలియవచ్చుచున్నది. యాత్రచేయుచున్న భక్తులు దమ యిష్టదైవములను దాఁకుటవలన దోషముగలుగదు. అయినప్పటికిని ముద్దుపెట్టుకొనుటమాత్రము సరియైన పనికాదు" అనెను.

"నోరుండుటవలనఁ బ్రయోజనమేమి?" అనెను కామరూపుఁడు.

"ఔను, నోరున్నదానికిఁ బ్రయోజనము ప్రార్థించుట" అనెను కన్యకామణి.

"ఆహా! అలాగా, నాకులదైవమా! నీ యనుమతి ప్రకారమే నిన్నుఁ బ్రార్థించుకొనెదను నామనస్సు చలింపకుండునట్లు వరమనుగ్రహింపవలయును జుమీ"

ద్వి ప ద లు.

నెలఁతభాగ్యముగాదె ♦ నీ పాదయుగళిఁ
గొలిచియుండుట లహో ♦ కొమరుదీపింప
గండుమీలకుఁబుట్టి ♦ కాముబాణాళి
దండనాడుచునుండుఁ ♦ దరుణి నీ కండ్లు
ఎలతీవలనుబోలు ♦ నింతినీకరము
లలివేణి నగదెయా ♦ యబ్జనాళముల
చెందొవలనుబోలి ♦ చివురాకుఛాయ
లందియోకాంతనీ ♦ యంఘ్రులొప్పారు
నట్టిసౌందర్యమ్ము ♦ నన్యకామినులు
నెట్టనసరిపోల ♦ నేర్చిరే, కాన
కనువిచ్చి నావంకఁ ♦ గడకంటనైనఁ
గనుఁగొన్నఁ దప్పౌనొ ♦ కర్పూరగంధి
మెఱుఁగారుమోమున ♦ మేలురెట్టింప
జిఱునవ్వునగరాదె ♦ చివురాకుఁబోణి
యలరారవీనుల ♦ కమృతంబులొలుకఁ
బలుకంగఁ దప్పౌనొ ♦ పంకేరుహాక్షి
నీలీల లిట్లువ ♦ ర్తించు నామాట
లాలింపఁదగదొకో ♦ యంభోజవదన

పడఁతి నీ యొడలు ద ♦ ప్పక చూడవెఱతుఁ
దోడిఁబడికనుఁబాటు ♦ దోచునోయనుచుఁ
గలకంఠి నీయున్న ♦ గర్వంబుచూచి
పలుకఁజూచిన నోరు ♦ పలుక ద దేమొ
నలినాక్షి యిటుమీఁద ♦ నన్ను పేక్షింపఁ
దలఁచితివేనియుఁ ♦ దర్పకుండేచి
మోహనాస్త్రము లేసి ♦ మోహరింపంగఁ
దేహంబునాకునం ♦ దేహంబుగాదె
అప్పుడు బ్రదికింప ♦ నలవియేనన్ను
నిప్పుడే కరుణింపు ♦ మిభరాజగమన ”

ఈ విధముగా వీరు మోహము దలకెక్కి నర్మోక్తులు పలుకుకొనుచుండఁగానే యా బాలికామణితల్లి దానిని బిలుచుకొని వచ్చు నిమిత్తమొక చేడియ నంపెను. ఆచెలికత్తెవచ్చి యా యువతీమణిని దాని తల్లియొద్దకుఁ దోడ్కొనిపోయెను.

పిదపఁ గామరూపుఁడా బాలికనుగూర్చి దాఁపుననున్న వారిని విచారింపఁగా, తన మోహమునకుఁ గారణభూత యగు నా కన్యాకామణి పేరు 'కమలిని' యనియును, అదిసోమ పాలుని కుటుంబమునకుఁ బరమద్వేషియైన శ్రుతకీర్తియొక్క పుత్రికయనియు తల్లిదండ్రులకు వెనుక వారికిగల లెక్కకుమిక్కుట మైన సంపద కదియే యజమానురాలనియుఁ దెలియ వచ్చెను. అంతట కామపాలుఁడు, "అయ్యో! ఇట్లు ముందువెన్కలుచూడక మనశత్రువుయొక్క పుత్రికమీఁద మనస్సు చెల్లించితినే" యని తన్నుఁ దాను నిందించుకొనెను.

దానివలన వాని మనస్సునకు సంకటము గలిగినప్పటికిని కమలినీ విషయమునఁ దాను వినియోగించిన ప్రీతినుండి దొలఁగలేదు. ఆవిధముగానే కమలినియును వీనిని జూడఁగానే ముందువెనుక లాలోచింపక వీనియందుఁ బ్రీతిని జెల్లించి, పిదప వానినిగూర్చి విచారించెను. అప్పుడు, వాఁడు సోమపాలుని పుత్రుఁడైన కామరూపుఁడగుట దెలిసి మిగులఁ బరితపించెను. ఇంతేకాక కమలిని, ,, కామరూపుఁడు మన పగవాని కొడుకు. నేనో వానియెడల మనస్సు చెల్లించి పెండ్లి చేసికొనునట్లు సంకల్పించుకొంటిని; ఇట్లు విపరీతముగా ముగించుట యేదో యొక యుత్పాతమునకే సూచన యగుచున్నది'' యని ఖేదపడెను.

అప్పుడు, అర్ధరాత్రమాయెను. కామరూపుఁడు, అక్కడికివచ్చినవారితోడనే తననెయ్యునిఁగూడి యాభవనమునుండి తొలఁగిపోవువాఁడయ్యెను. తన శరీరము, విధిలేక దానియింటినుండి తొలఁగిపోవుచున్నప్పటికిని మనస్సేమో దానిగృహమునందే లగ్నమయియుండెను. అట్లు తనతోవచ్చువారినిఁగూడి కొంతదవ్వేఁగి యెవ్వరికిని దెలియక మరలివచ్చి, కమలినీ గృహమునకుఁ బ్రక్కఁగానున్నతోఁట గోడనెక్కి లోనికిదుమికెను.

అచ్చట దానినిగూర్చి కొంతవఱకుఁ దలపోయుచుండఁగా నున్నట్లుండి, మెఱుపు మెఱసినట్లు, మూర్తీకరించిన మోహనమంత్రాధిదైవతమో యనునట్లది కామరూపుఁడున్నచోటి కెట్టయెదుట నున్న మేడపైఁదోఁచెను. అప్పుడా

చోటులో చెట్లు దట్టముగా వ్యాపించియుండినందునఁ జంద్రిక చక్కఁగాఁ బ్రసరించుచుండలేదు. అప్పుడు కామపాలుఁడు దానినిగూర్చి వర్ణించుచుండెను. ఆ తరుణమున, నక్షత్రకాంతముగా మేడపైఁ దోఁచిన కమలిని దనచేతిని జెక్కుటఁ జేర్చెను. అది గని కామరూపుఁడు, ' అక్కటా! నాజన్మము వ్యర్థము. నే నాయింతియుంగరముగాఁ బుట్టు భాగ్యము చేయనైతినే! అట్లు జన్మించియుందునేని, సర్వదా దాని యంగుళియందేకదా కాపురముందును ' అని మదిని తలఁచుచుండఁగానే, కమలిని ,,అక్కటా!'' యని నిట్టూర్పు నిగిడ్చెను. కమలినియొక్క కంఠధ్వనిని వినఁగానే కామపాలుఁడు,,, ఓ గంధర్వకన్యా! దయచేసి మఱియొకతడవకు నోరుతెఱచి యొకపలుకు పలుకుము. ఔను, నేను నిన్ను గంధర్వకన్యయని సంబోధించుట పొరపాటు గాఁజాలదు! నాకలోకమునుండి యవతరించిన గంధర్వ కామినివే నీవు. అదిగో ధవళకాంతులఁగండ్లు మిఱుమిట్లు గొలుపు మేడయం దగపడుచు నేత్రోత్సవము గలిగించెదవే '' యనెను.

అది కామరూపునియెడలఁ దాను బెట్టిన ప్రీతివలనను, వాఁడచ్చట నుండజాలఁడను నమ్మకముతోడను, ,, హా, కామరూపా! కామరూప! నీ కాపేరేలగలిగెను? నా నిమిత్తము నీ తండ్రిగారిని నీనామధేయమును ధిక్కరింపరాదా? అట్లు చేయుట నీకు సాధ్యపడదేని, నాయందు నీకు నిజమయిన ప్రీతి గలదనుటనుగూర్చి ప్రమాణము చేయుము.

నే నిదిగో, నాతల్లిదండ్రులను నాకుఁ గల సర్వమును దిర స్కరించుటకు సిద్ధపడియున్నాను" అనెను.

కామపాలుఁ డామాటలను విని ధైర్యమును దెచ్చు కొని యున్నప్పటికిని దాని పలుకుల నింకను వినవలయునని కోరి కొంతదనుక నేమియు మాటాడక యూరకుండెను. అది కామరూపుఁడచ్చట లేఁడని దలఁచియుండునది గావున వాని పేరినిగూర్చియు వాని వంశమును గూర్చియు నిందించి "అక్కటా! వానికి మఱియొక పేరు దొరకకపోయెనే యని పరితపించెను. తన దేహమునందలి యవయవములను ఖండించి వైచుటవలెఁ గామరూపుఁడను పేరిని దొలఁగించుట యొకకష్టమా?" అనెను. కాఁబట్టి, అపేరిని దొలఁగించి యందులకు బదులుగాఁ దన్నుఁ బొందరాదో? యని చెప్పెను. ఇట్లు పలువిధములుగా వానియందుఁగల యను రాగవిశేషముచేత నేమేమో నోటికి వచ్చినవన్నియుఁబలుకు చుండెను. ప్రీతిపూర్వకముగా, కమలిని యిట్లు పలుకు చుండుటకు కామపాలుఁడు నోరుమూసికొని యూరకుండ లేక, కమలిని తనలోఁ బలుకుకొనుచుండిన మాటలు తన్నుఁ జూచి పలికినపలుకులుగాఁ దలపోసి, తత్క్షణమే దానిని జూచి, "హా! యువతీమణీ! నన్ను నీ ప్రాణనాథుఁడనిగాని, లేక నె కిష్టమయిన మఱేపేరిడిగాని పిలువుము. నీకుఁ గామరూపుఁ డను పేరియందు ద్వేషమున్నయెడల నేను దానిని బరిత్యజిం చెదను" అనెను.

ఈరీతిగా నాతోటయందు మగవాని కంఠధ్వని విన రాఁగా, నీ నడిరేయిని జీఁకటిలో దాఁగియుండి బదులిచ్చు వాఁ డెవఁడో; యని కమలిని దలఁచెను. వాఁడు మరల మాటలాడుటకుఁ బ్రారంభించి, రమారమి వందమాటల నుచ్చరించునంతలోనే వాఁడు కామరూపుఁడగుటను కమలిని దెలిసికొనెను, ఇట్లు క్షణకాలముననే తమ ప్రియుల కంఠ ధ్వనిని దెలిసికొను సూక్ష్మబుద్ధి, వారియెడల మోహము నించిన ప్రియకాంతలకుఁదప్ప మఱి యెవ్వరికలవడును? తక్షణమే, ,, ఈ తోఁటగోడను దుమికివచ్చుటవలన నీ కపాయము సిద్ధించుట నిశ్చయము నాబంధువులయం దెవ్వ రేని నిన్నుఁజూచినయెడల నీవు గోపాలుని పుత్రుఁడ వగుట చేత నిన్నుఁ జంపివేయుదురే ,, యనెను కమలిని. అందు లకుఁ గామరూపుఁడు, ,, అయ్యో! నీబంధువులందఱును జేరి యనేకఖడ్గములతో నన్నుఁ బొడిచి హింసించినప్పటికిని, నీ చూపులు నన్ను బాధించునట్టి బాధకు సరిపోలదే! నీవు నన్నుఁ బ్రీతిమై నాదరించితివేని వారిపగ నన్నేమి చేయును. అట్లాదరింపవేని, నీప్రీతికిఁ బాత్రముకాని యీ దేహము బ్రదికియుండియును బ్రయోజనమేమి? ఈ పాపము చేసిన ప్రాణి, వారిఖడ్గములకెరయగుట యుక్తమే,, యనెను. అందు లకుఁ గమలిని, ,, మంచిది ఈచోటి కెట్లువచ్చితివి? నీకెవ్వరు త్రోవ చూపిరి? ,, అని విచారించెను. ,, నాకుఁ ద్రోవ చూపువా రెవరు? అంతటికిని సహాయుఁడు లోకపూజ్యుఁడగు మన్మథస్వామియే. మఱియొకటి చెప్పెదను. నే నెప్పుఁడును

నోడనడపినవాఁడను గాను. అట్లుండియు నీ ప్రపంచములోని మహాసముద్రమున కావలిగట్టున నీవుండి నిన్నుఁ దెచ్చుకొన వలసియుండిన నే నొక్కఁడనే భయపడక నావికాయాత్ర చేసి యిష్టము నెఱవేరునట్లు నిన్నుఁ దెచ్చుకొనఁగలనే!" అనెను.

కమలిని, తనకు వానియెడలఁ గల మోహము వెలిఁ బుచ్చరాదని దలఁచియుండియు వానికిఁ దెలిసియుండుట వలన సిగ్గుచే దానిముఖము వింతరీతిని వెలుఁగొందెను, రాత్రికాలమగుటచేతఁ గమలిని ముఖమునందలి వేఱుపాటు కామపాలునికిఁ దెలియరాలేదు. అది తన చెప్పినమాటలను ద్రిప్పికొనుటకు సాధ్యపడెనేని యట్లే చేసియుండును. అది యిప్పుడెట్లు సాధ్యమగును? కష్టపడి సంపాదించినవస్తువుల యందు మానవు లెక్కువ ప్రీతిని వెలయించుట సహజమే కదా! ఇది తలఁచియే పడఁతుకలలోఁ బెక్కురు, దాము గోరిన నాయకులు దమ్ము లాఘవముగాఁ దలఁతురేమో యని మొట్టమొదట నెక్కువ చనువీయక తమ లజ్జను విరివిఁ జేసి వెలయింతురు. ఇంతేకాక, తాము వారిని పెండ్లాడు టయే లేదని మోముగంటువెట్టుకొని తాఱుమాఱులుగా మాటలాడుదురు. వీనిని దలపోసి కమలినిసైతము, వాడుక ప్రకారము దన నాయకుని దగ్గఱించనీక దూరమునందే నిలిపియుండును. అయినను, అప్పుడది పలికిన పలుకులచేత నింకను గొన్నిదినములు గడుపవలెననిగాని, నిన్ను వివాహ మాడననిగాని చెప్పుటకు సాధ్యపడకుండెను. వాఁడచ్చట

దాగియుండ తనమాటలను వినుచుండఁగలఁడని యది తలం చినదే కాదు. వాఁడు, తాను మోహము దలకెక్కఁగాఁ బలికిన పలుకుల నంతటిని వినెను. కావునఁ దనస్థితి నాలో చించి, వానిని బ్రీతితో నాదరించుటకుఁ బ్రయత్నించునది యై పరమ ద్వేషియగు సోమపాలుని పుత్త్రుఁడగు కామ రూపునిఁ జూచి, ,, ఓ సౌందర్యవంతుఁడా! బుద్ధి చాపల్య మునఁగాని, యల్పసంతుష్టిని విషయముచేసిగాని నిన్నుఁ జేరినట్లు దలఁపకుము. నీయందలి ప్రీతిని బయలు పఱచుట దప్పుగాఁ గనఁబడెనేని యా పొరపాటు నాది కాదు. అది. తప్పక, నిన్నుఁ గనఁబడనీక దాఁచియుంచిన యీ రాత్రిదే యగును. సాధారణముగా స్త్రీలయొక్క యలవాటులను గూర్చి విమర్శించుచో, నే నాలోచింపని పనినే చేసినట్లు దోఁచినను బైకి బుద్ధిశాలినులవలె నటించుచు, కపటముగాఁ దెచ్చుకోలు సిగ్గులచే మాయలుపన్ను కన్యకలకంటె నేను విశ్వాసపాత్రయగు పతివ్రత యగుదును '' అనెను.

ఈ మాటలను వినఁగానే కామరూపుఁడు, ,, మెచ్చు కొనఁదగిన వినయముతోడఁ గూడిన నిన్ను లవలేశమైనను లాఘవబుద్ధితోఁ జూడను. అట్లు నాస్వప్నమునందును నిన్నుఁ గూర్చి తక్కువగాఁ దలపోయను. కర్మసాక్షులయిన యీ చంద్రసూర్యులపైఁ బ్రమాణముచేసి చెప్పఁగలను.'' అని వాఁడు చెప్పునంతలో వానిమాటల కడ్డమువచ్చి, కమలిని, ,, ప్రియుఁడా! నీవు నాకు లభించుటకు నేను మిక్కుటముగా సంతసిల్లెదను. అట్లుండియు మన మీరేయియందు ముందు

వెన్కలు పర్యాలోచింపక తొందరపడి మాటలాడుకొనుటను గూర్చి విచారింపఁగా నాకు నిజముగానే దుఃఖము గలుగు చున్నది ” యనెను.

ఆమాటలకుఁ గామరూపుఁడు, “ నేను నిన్నుఁదప్ప మఱియొక నారీమణిని స్నేహింపఁజాలనని వాగ్దత్తము చేసి యున్నాను. నీవు సైతమట్లేవాగ్దత్తము చేయవలయునని ప్రార్థించెదను ” అని నిర్బంధపఱచి యడిగెను.

“ మీరింతకుఁ బూర్వ మిక్కడ దాఁగియుండఁగా, మీరు నన్నిట్లు వాగ్దత్తము కోరకమున్నే మిమ్మును వివాహము చేసికొనునట్లు చెప్పుకొనుచు నుంటినిగదా! మఱియొక తడవకును జెప్పవలయునో ? సరి, నాకట్లు సెప్పుటయు నాక లాఘవము గాఁజాలదు. నేనో సముద్రమంత యుదారతను దానిలోఁతునుఁబోలిన ప్రేమను గలిగినదానను. మీకు వాగ్దత్తము చేయుకాలములయందంతటను నాకు సంతోషమే కలుగుచుండును. కావున నాకతడవకుఁ జెప్పిన మాటలనే పలుతడవలకుఁ జెప్పుటకై వెనుదీయను ” అనెను కమలిని.

ఇట్లిరువురును సంతోషపూర్వకముగా సంభాషించు చున్నప్పుడే, కమలినిని దనయొద్దఁ బరుండఁబెట్టుకొనుచుండిన దాదియైనది, “ అమ్మా, కమలిని ! ఎంతప్రొద్దాయెను ! ఇంకను శయ్యను జేరకున్నావేమి ? అదిగో చూచితివా ? వేఁకువజాము దగ్గఱించుచున్నది ! అని తాను లోపల నుండు వక్లే దానిని బిలిచెను.

కమలిని దానిపిలుపునకు లోపలికిఁబోయి తత్క్షణమే వెలుపలికి వచ్చి కామరూపునిఁ జూచి, “ప్రియుఁడా! నాయందు నీకు నిజమైనప్రీతి యున్నపక్షమున, నన్నుఁ బెండ్లాడుట కెచ్చుగా నిచ్చయుండెనేని, నా సంపదనన్నిఁటిని నీ పాదార విందముల కర్పించి, మీరీభూమండలమునం దేచోటికేఁగినను మీతోడిద లోకమని మీవెంబడినే వచ్చుదానను. అట్లు మిమ్మును బరిణయమాడుటకుఁ దగిన ముహూర్తమొకదాని నిర్ణయించుకొని మీకడ కొకదూతనంపెదను” అని యొకటి రెండుమాటలు పలికి లోపలికిఁబోయెను.

ఇవ్విధముగా దమ వివాహవిషయమును గూర్చి మాటలాడి యొక ముగింపునకు వచ్చునంతలోపలనే, కమలిని యొక్క దాది, దానిని పలుతడవలకుఁ బిలుచుచుండినందున నూరుపిచ్చుక కాలికి దారముగట్టి దానిని గొంత యెగుర విడిచి మరల లాగికొని యాటలాడు పడుచులు, ఆపిట్టను వదలి పెట్టుటకెట్లు సమ్మతింపరో యట్లే కామరూపునిఁ బంపి వేయుట కెంతమాత్రము సమ్మతింపక పలుతడవలకు లోపల నుండి వెలుపలికివచ్చుచు వానిని జూచుచు మరల లోపలికిఁ బోవుచు నుండెను. ప్రియనాయకునికిని బ్రియకాంతకును రాత్రిపూట నొకరితోనొకరు సంతోషపూర్వకముగా సల్లా పించుకొనుచుండుటకంటె నింపయిన సంగీతమొకటి యుం డదు. కావున యువతీమణియగు కమలినియొక్క సల్లాప మును వదలిపెట్టిపోవుటకుఁ గామరూపునకుఁ గొంచెమైనను

మనస్సు లేదు. అట్లుండియుఁ దుష్టతుదకుఁ దామిరువురును దమ చాంచల్యములను వదలి నిద్రింపవలయునని పరస్పరము కోరికొనుచునే యొండొరుల నెడఁబాయువారైరి.

వారట్లొకరినొక రెడఁబాయునప్పు డరుణోదయమై యుండెను. కామరూపుఁడు దన ప్రియురాలిని గుఱించియును దానిని గని సంతోషముగా సల్లాపించిన సంభాషణను గూర్చియును దలఁచి తలఁచి పరవశత ననుభవించుచునుండి నందున కంటికి నిదుర పట్టక యింటికిఁ బోవుటకుమాఱుగా సదానంద తీర్థుఁడను నొక సన్న్యాసిని దర్శించునిమిత్తము సమీపము నందేయున్న యతని మఠమునకుఁ బోయెను.

ఆసన్న్యాసులలో నుత్తముఁడు కామరూపుఁడు వచ్చునప్పుడు ధ్యాననిష్ఠాగరిష్ఠుఁడై యుండెను. సూర్యోదయ మగుటకుమున్నే కామరూపుఁడు, తనయొద్దకు వచ్చుటను దెలిసి, వాఁడు, కమలినీనిమిత్తము రాత్రియంతయును నిద్ర పోవక మేల్కనియుండుటను దెలియక, ,, యౌవనమున మానవులకుఁ బలువిధములుగా మోహవికారములు గలుగు చున్నవి. ఆ విధముగానే వీఁడును మంజుభాషిణియందలి యాసచేత రాత్రియంతయును మేల్కనియుండినట్లు దెలియ వచ్చుచున్నది '' అని తనలో ననుకొనెను.

కామరూపుఁడు, కమలినినిగూర్చి తనకు సంభవించి యున్న యనురాగమును విన్నవించి, నాఁటి దినమే మాకుఁ బెండ్లి చేసిపెట్టవలయునని యతనిని వేఁడుకొనెను. ఆ యతీశ్వరుఁడు, వీనికి మంజుభాషిణియందుఁ గలిగియున్న

యనురాగమును, అది వీనిని లక్ష్యపెట్టకయుండిన విధమును, వీఁడు మనతోఁ బలుతడవలకుఁ జెప్పియున్నాఁడే! వీనికి మంజువాణియెడలఁ బ్రేమ యధికమని మనకును జక్కఁగాఁ దెలిసియున్నదే! అట్లుండఁగా వీనిహృదయ మున్నట్లుండి యెవ్విధముగా మాఱఁగలిగెనని యాశ్చర్యపడి, ఆకసమందు జూపునిలిపి, ,, హా, దైవము! ప్రీతికొఱకు మానవులు స్నేహించెదరా? లేదు; యెవతె యందకత్తెగాఁ గంటి కగపడునో దానియందే మనస్సు చెల్లింతురు '' అనెను.

ఆమాటలకుఁ గామరూపుఁడు, స్వామీ! నాయం దించుకంతయైనను ప్రీతిలేని మంజుభాషిణియందు నేను ప్రేమ నిలిపియుండుటనుగూర్చి నా కెన్నియో తడవలకు దానిపైఁ జింతను వదలిపెట్టునట్లు బుద్ధి సెప్పియున్నారే! యీ కమలిని యను కన్యకారత్నము దానివంటిది గాదు. నా యందే ప్రీతినిలిపియున్నది. నాకును దానియం దనురక్తి గలదు. కాఁబట్టి నే నా యువతిని బెండ్లాడుటకేమి యభ్యంతరము? '' అనెను.

సదానందయతి, కామరూపుఁడు సెప్పిన కారణములను విని, సరియనియును, కమలినీ కామరూపులగు నీయిరువురికిని పెండ్లియైనయెడల సోమపాల శ్రుతకీర్తులకుఁ గల చిరకాల విరోధము దొలఁగిపోవునే యనియును దలఁచెను. ఈ యుత్తముఁడయిన సన్న్యాసి పైఁ జెప్పిన రెండు కుటుంబముల వారికిని గావలసినవాఁడై యుండుటచేత, వారిలో నప్పటప్పటికిఁ గలుగుచుండు కలఁతలకు మిగుల వ్యసనపడి యెట్లయినను

వారు స్నేహము గలిగి మెలఁగిన బాగుగానుండు నే యని వారిమైత్రికిఁ బలుతడవలకుఁ బ్రయత్నించియున్నాఁడు. ఇతని ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనము లయ్యెను. ఇవన్నియును జక్కఁగా నాలోచించి, కామరూపునియందుఁ గల విశేషవాత్సల్యమువలన వాఁడేమి కోరినను ఆటంకమేమాత్రము లేక, నెఱవేర్పవలయునని దలపోసి, వానిని జూచి, "కామరూపుఁడా! నీ యిచ్చవచ్చినచో మీయిరువురకును బెండ్లిచేసి పెట్టెదనని" దన యనుమతిని దెలిపెను సన్న్యాసి.

అతఁడిట్లు చెప్పఁగాఁ దన జన్మోద్దేశము సఫలమయినట్లు సంతోషించెను కామరూపుఁడు. కామరూపునికిఁ గమలినియందే చిత్తము నెలకొనియుండుటచేత, ఆహారవిహారములయందు వానికిష్టము గలుగదయ్యెను.

ద్విపదలు.

ఎలమావి తోఁటలో ♦ నేకాంతసీమఁ
బోలుపైన కురువింద ♦ పొదరిల్లుఁ జేరి
పన్నీరు చిలికించి ♦ పచ్చకప్పురము
లెన్నికఁ జల్లించి ♦ యెలమిఁ బుట్టంగ
కలికి రా చిల్కలు ♦ గండు కోయిలలు
వెలయించు పల్కులు ♦ వినుచుండి యంతఁ
గలఁగుఁ దత్తఱపడుఁ ♦ గంపించు వగచు
విలపించుఁ దలయూచు ♦ వెఱచు మైమఱచు
విరహవహ్నికిఁ జిక్కి ♦ వెఱ్ఱివాఁ డగుచుఁ
దరమిడి తనలోనఁ ♦ దలపోయుఁ దొడఁగు

పడఁతుక నామాట ♦ పాటించుకొన్కొ
యేకాంతమున నుండి ♦ యిభరాజ గమన
నాకుఁ బ్రీతి మెలర్ప ♦ నన్నలరింపఁ
బ్రాకటంబుగఁ బల్కు ♦ పలుకు సత్యంబొ
తియ్యవిల్తుఁడు నాను ♦ దెరువు తోడగుచుఁ
దొయ్యలి నిటుకుఁ దాఁ ♦ దోడ్తెచ్చునొక్కొ
అని తన కోర్కులు ♦ య్యాలలూఁగంగ
మనసిజా శుగపంక్తి ♦ మానంబు దూల్ప
మృగనేత్ర తనయొద్ద ♦ మెలఁగినట్లయిన
నగపడి సరసంబు ♦ లాడినట్లయిన
బయలు గౌఁగిటఁ జేర్చి ♦ భావించి నగుచు
జయశాలి మారుండు ♦ చాలనాడింప"

ఆసమయమునకు సరిగా, కమలినియొద్దనుండి యొకదూత కామరూపుఁడున్నెడకు వచ్చిచేరెను. కమలినియును దగినట్లలంకరించుకొని యింటిని వదలి సదానందస్వామి మఠము కొద్దకువచ్చి చేరెను. కామరూపుఁడు నైత మచ్చోటికి రాఁగానే, సదానందస్వామి మంత్రలోపముగాని క్రియాలోపముగాని కలుగనీయక విధ్యుక్తముగా వారిరువురకును పెండ్లి చేసిపెట్టెను. మఱియు, చిరకాలముగా సోమపాల శుతకీర్తులకుఁ గల విరోధ మింతటితోఁ దీఱిపోవలయునని నిశ్చల హృదయుఁడై యీశ్వరునిఁ బ్రార్థించెను.

వివాహము ముగియఁగానే కమలిని దనగృహమునకు వెళ్లిపోయెను. ముందుదినము రాత్రి దన్ను సంధించినట్లే నాఁటి రాత్రికిని గామరూపుఁడు దన్నాచోటనే చూడవలయు నని గమలిని చెప్పియుండుటచేతఁ గామరూపుఁడు —

ద్విపదలు.

గ్రహదోష మనుమాట ♦ గలుగదో రవికిఁ
గుహకి సూర్యుఁడు ♦ గ్రుంకకున్నా డదేమొ?
పరశురాముఁడు వేఁడఁ ♦ బశ్చిమాంభోధి
పారిఁబోరి దూరమై ♦ పోయెనో కాక
మెఱవడిఁ జనుదెంచి ♦ మేరుపర్వతము
చఱిఁబడి రవి తేరు ♦ సాగకున్నదియొ?
యని యిట్లు దమకించి ♦ యతివ మోహమునఁ
దనయుల్ల మొకభంగిఁ ♦ దనరారుచుండ
"వీనిమోహం బతి ♦ వేలంబుగాదె?
వీనిఁ జూడఁగఁ గాదు ♦ వెసఁబోదు" నంచు
విపుల తేజంబెల్ల ♦ వేగంబయడఁగ
యపరాబ్ధిలోఁ గ్రుంకె ♦ నర్కబింబంబు.
పడమటిదెస యనఁ ♦ బరఁగు భామినికి
నడరి కుంకుమ గంధ ♦ మలఁదినమాడ్కి
ననురాగ మెసఁగ సం ♦ ధ్యాకాల మయ్యె
ఘనమైన నక్షత్ర ♦ గణమంతఁ దోఁచెఁ
గలువలు వికసించెఁ ♦ గలఁగె జక్కవలు
వలరాజు విల్లెత్తె ♦ వసుధ నెల్లెడల.

వింతగాఁ జీకట్లు ♦ విరిసె నద్దెసల
నంత బాలేందుండు ♦ నస్తమించుటయు

ఆదినము మధ్యాహ్నము కామరూపునియొక్క స్నేహితులగు కీర్తివర్మయు గుణదేవుఁడును వైశాలీనగర రాజమార్గమునఁ బోవుచుండిరి. అప్పుడు, క్రూరుఁడైన జీవకునితోడ వచ్చుచుండిన శ్రుతకీర్తి బంధువులలోఁ గొందఱు, వీరిని జూచిరి. కుత్సితుఁడైన యాజీవకుఁడు, ముందురేయి శ్రుతకీర్తి ప్రభువుచేసిన విందునకుఁ బోయియుండి, యచ్చోటఁ గామరూపునిఁ జూచి కోపావేశముతో వాని త్రెళ్లింపఁ జూచెను గదా! వాఁడు కీర్తివర్మను జూచి, "ఓరి యల్పుఁడా! నీవా నీచుఁడగు కామరూపునకు స్నేహితుఁడవు గావా? యిట్టి దుశ్చర్య నీ కలవడుట మంచిదా? దుర్బుద్ధీ నిన్నిప్పుడు జీవములతోఁ బోవిడుచుట లేదు; చూడు నాదెబ్బ" అని నోరికి వచ్చినట్లంతయుఁ బలికెను. కీర్తివర్మ, తన్ను నిర్నిమిత్తముగ నెదుర్కొని కారాకూరములు పలుకు జీవకునిఁ జల్లని చూపులతోఁ జూచి సదయ శీతల వచనములతో వాని కోపము పశమిల్లఁ జేయుటకుఁ బ్రయత్నించెను. వాఁడెంత యోపిక దెచ్చుకొని శాంతముగాఁ బ్రవర్తించినప్పటికిని బ్రయోజన పడక తుదకా మూర్ఖునితో జగడము చేయవలసియుండెను. వీరిరువురు నిట్లు ద్వంద్వయుద్ధము చేయుటకుఁ బ్రయత్నించుచుండఁగానే యాదారిని గామరూపుఁడు వచ్చుచుండెను. జీవకుఁడు, కామరూపునిఁ జూడఁగానే, వానికిఁ దోఁచిన కోపమునకు మితి గలిగించుటకు సాధ్యపడదు.

తత్క్షణమే, జీవకుఁడు, తనతో జగడము వేయుటకు సిద్ధపడి యున్న కీర్తివర్మను వదలి, కామరూపుని దిక్కు మొగమై, “ ఓరీ మానవాధముఁడా ! భ్రష్టుఁడా ! ” అని దూషణోక్తుల సంబోధించెను. అట్లు, వాఁడు దూషించి నప్పటికిని, జీవకుఁడు కమలినికి సమీప బంధు వగుటచేతను, వాని యెడలఁ దన ప్రియురాలి కెక్కువ ప్రీతి యుండుటచేతను, వానితోఁ గలహించుటకు కామరూపుఁడు సమ్మతింపఁ డయ్యెను. ఇంతేకాక, కామరూపుఁడు సుగుణములకుఁ బుట్టినిల్లు, పరమ శాంత స్వాంతుఁడు. కావుననే వాఁ డెప్పటికిని శ్రుతకీర్తి సోమపాలుర కలఁతలలో సంబంధము గలిగించుకొనుట లేదు. మఱియును దనప్రాణేశ్వరి శ్రుతకీర్తి పుత్రిక గావున, వాని చెవికి శ్రుతకీర్తిపే రమృతోప మానమై యొసఁగుచుండెను. ఇన్ని కారణములనుబట్టి, కామరూపుఁడు, జీవకునిఁ జూచి, “ అయ్యా ! యుత్తమ పురుషుఁడా ! ” అని వినయముతో సంబోధించి,

ద్విపదలు.

“ కోపంబుగారాదు ♦ గోడులఁ బెంచుఁ
గోపంబుగారాదు ♦ కోర్కులఁ జంపుఁ
గోపంబె మిత్రుఁడా ! ♦ ఘోరారి గానఁ
గోపంబుఁ జంపుమా ! ♦ కూర్మి వాటిల్లుఁ
దాపంబు దీఱును ♦ దనరు సౌఖ్యంబు
పాపౌఘములఁ బాసి ♦ బ్రదుకనోఁ జుమ్మీ ”

అని యుక్తి యుక్తముగాఁ బలికి యామూర్ఖుని కోప ముపశమిల్లఁ జేయుటకుఁ బ్రయత్నించెను.

జీవకునికి వాని శాంత వచనముల వలన కోపము హెచ్చు పెరిగి, తప్తతైలమున శీతల జలబిందువులు పడినట్లయ్యెను. వాఁడు, కామరూపునే కాక వాని కుటుంబము వారి నందఱను మిత్రవర్గమును హతము సేయవలయు నని తివిరెను. అంత వాఁడు, రూక్ష వీక్షణములతో గామరూపునిఁ జూచి, యొరనుండి కత్తి దూసికొనెను. ఇప్పటికిని కామరూపుఁడు తన శాంతమును జే వదలక యూరకుండెను. ఒక చెడుగు మాటనుగాని పలికినవాఁడు గాఁడు. అట్లు కామరూపుఁడు పరమ శాంతుఁడుగా నుండుటకు కారణ మిది యని తెలియక కీర్తివర్మ, ,, అయ్యో, వీఁ డేల యిట్లు పౌరుషము దిగి యున్నాఁడు ? నిజముగా వీనికి మగతనము లేదు. కాకున్న వీఁ డిదివఱకే యీవదరుఁబోఁతును సరిపెట్టి యుండఁడా ? వాఁడు పలుకునట్టి దుర్భాషలకుఁ బరమ శాంతుఁడై చెవి యొగ్గుచున్నాఁడు. అక్కటా ! యీ నీచుఁడు పలుకు కఠినోక్తులు మర్మభేదనచణములై యొసఁగుచున్నవే ! ,, అని తలఁచి, యింతకు మున్ను జీవకునకును దనకును గటస్థించిన వాక్కలహము ననుసరించి, ,, ఓరి, యేమి నా కెదురు లేరని దలఁచి నోటికి వచ్చిన ట్లెల్లను బ్రేలెదవు ? ఏల యీ శుంఠతోఁడి వివాద మని యొప్పు

దెచ్చుకొని మెలఁగినను, పలువా ! పలువిధములుగా వదరు చున్నావు. నీవేమి చేయుదువురా ? అని యోర్వఁ జాలక జీవకుని నిందించెను.

అప్పుడు, కీర్తివర్మను జీవకుఁ డెదుర్కొని జగడము చేయుటకుఁ బ్రయత్నించెను. వీ రిరువురు ఘోరముగా ద్వంద్వయుద్ధము సేయుచుండఁగా వలదని, గుణదేవ కామరూపులు దమకు సాధ్యమగు నంతవఱ కాటంకపఱచిరి. వీరి ప్రయత్నము లేమియుఁ గొనసాఁగక పోయెను. తుదకు జీవకుఁడు కీర్తివర్మను జంపివేసెను. తన మిత్రుఁడైన కీర్తివర్మ యట్లు చంపఁబడఁగానే కామరూపునికిఁ బొడసూపిన కోప మింతంత కాదు. అట్లు, దన్ను మీఱి యుదయించిన కోప మణఁచి కొనఁ జాలక, జీవకుఁడు దొల్లి తన్నుఁ దిట్టినట్లే తాను వానిని బలువిధముల దుర్భాషలాడి, ,, ఓరి చండాలుఁడా ! పాతకుఁడా ! ఏలరా యిట్టి ఘోరకార్యమును జేసితివి ? నిన్నింక జీవములతో వదలుట లేదు. ” అని వాని నెదుర్కొని, కోపావేశముతో నొక వ్రేటునకే వాని నేలఁ గూల్చెను.

ఇట్లు వైశాలీ నగర రాజమార్గమున జనసంచార మధికముగా నున్న కాలమున నొకరితో నొకరు జగడము లాడి పెల్లురేఁగిన కోపమునకుఁ దాసులై యొకరి నొకరు పొడిచికొని నేలకూలిన సంగతి, త్వరలోనే నగరము సందంతటను వ్యాపించెను. ముసలి వాండ్రయిన శ్రుతకీర్తియును సోమపాలుఁడును దమ భార్యలను గూడి యచ్చోటికి వచ్చి

చేరిరి. ఆనగరమును బాలించుచుండిన రాజు సైతము చోటికి వచ్చి చేరెను. ఈరాజు జీవకునిచేఁ జంపఁబడిన కీర్తివర్మకు సమీప బంధువు. శ్రుతకీర్తి సోమపాలురకు సర్వదా కలహములు జరుగుచుండి నగరము కలఁతలపాలగుటకు వగచి, నేరముచేసిన వారిని న్యాయప్రకారము దండింపవలయునని దీర్మానించుకొనెను. గుణదేవుఁ డీ కలహము మొదటినుండి తుదవఱకు సాంతముగాఁ జూచుచుండిన వాఁడు గావున రాజుగారు వానిని విచారించిరి. గుణదేవుఁడు దెలివిగలవాఁడు. వాఁడు రాజునుత్తరువు ప్రకారము, ఒక్క మాటయైనను దిగవిడువక జరిగినది జరిగినట్లు పూసగ్రుచ్చిన విధముగా రాజుగారికి విన్నవించెను. తన స్నేహితులు చేసిన పని సరియైనదే యని రాజుగారి మనస్సునకుఁ దగులునట్లు మిగులఁ జమత్కారముగాఁ బలికెను. మఱియు సాహసాల వలన నెవ్వరికిఁగాని యాపద గలుగని విధమున సాక్ష్యము పలికెను.

శ్రుతకీర్తియొక్క భార్య తన బంధువైన జీవకుఁడు చంపఁబడుటనుగూర్చి మిగుల దుఃఖించి కామరూపునియెడల ద్వేషమత్యంతము గలిగినదై రాజును జూచి, ,, ఓ మహారాజా! నాబంధువగు జీవకునిఁ జంపిన హత్యాసక్తుఁడగు కామరూపునిఁ దప్పక దండింపవలయును. వానికి స్నేహితుఁడుగాను, సోమపాలుని కుటుంబమును జేరినవాఁడుగాను నుండు గుణదేవుని మాటలను మీరు నమ్మఁదగ ,, దని మనవి చేసెను. ‹ కమలినికి నాయకుఁడు కామరూపుఁడు ›

అనుటను దెలియని యా యింతి వానికి విరుద్ధముగానే వాదించునది యయ్యెను.

అంతట సోమపాలుని భార్య రాజును జూచి, ‘ఓ మహాప్రభూ! నాకుఁ బుత్రదానము చేయవలయును. ఇంతే కాక కీర్తివర్మను జంపుటచేత జీవకుఁడు వధకర్హుఁడే! అట్టి వానిఁ జంపుటచేత నాకొడుకు దగనికార్యమును జేసినవాఁడు గాఁడే’ యని యొకవిధముగా న్యాయమునే యెత్తిపలికెను.

వీరిరువు రిట్లు మనస్సు పుండయి పలికిన పలుకులు పెడచెవినిఁబెట్టి యచ్చట జరిగిన సంగతులను జక్కఁగా విచారించి, ‘కామరూపుఁడు వైశాలీ నగరమును వదలి పెట్టి యెచటికైనను దొలఁగిపోవలయు’ నని దీర్పు చెప్పెను.

ఆదినము పగటిపూటఁ గామరూపుఁడు, పెండ్లియాడిన బాలికామణి యగు కమలిని, మరలఁ దన విభుని ముఖమును దర్శించుటకుఁ గాకుండని సంగతిని వినినయెడల నెంత యమ్మలికను జెందునోకదా! రాజన్యాయము మెట్లుండును? ఈసంగతిని వినఁగానే తన ప్రాణేశ్వరుఁడు, తనప్రీతికిఁ బాత్రుఁడయిన జీవకునిఁ జంపివేయుటనుఁగూర్చి కోపమతిశయించి, ‘అయ్యో యీకామరూపుఁడు చూపునకుమాత్రము రూపవంతుఁడుగా గనఁబడుచున్నాఁడు గాని దయలేని మహాపాపి; దేవవేషమును వహించిన ఘోరరాక్షసుఁడు. పశువువలెఁ గన్పట్టి, వ్యాఘ్రమువలెఁ బలువురను హత్యచేయు మహాపాపి. ఈయివంటిమనస్సును వికసించిన మోమువలన గప్పియుంచువాఁడు. వానియం దుంచిన మోహముచేత

నక్కటా! యెట్లు వంచింపఁబడితిని ?" అని పలువిధములుగాఁ దనలోనే వానిని దూషించుకొనుచుండెను. తదనంతరము కామపాలుని యెడలఁ బతిస్నేహమతిశయించినందున బంధువు యొక్క మరణమునుగుఱించి దుఃఖించుటనుమాని, జీవకుని చేతికిఁ జిక్కిన నాప్రాణేశ్వరుని, నా కులదైవమునుగాదా కాఁపాడెను" అని యానందబాష్పములు నించెను. అది, రాజు తన పెనిమిటిని దేశభ్రష్టునిగాఁ జేసెనని వినినప్పుడు రెండువేలజీవకులు చంపఁబడినప్పటికిని దాని కంతవ్యసనము కలిగియుండదు. కాఁబట్టి, కామరూపుని దేశభ్రంశమును దలఁచితలఁచి యోఁపరాని దుఃఖమనుభవించునది యయ్యెను.

కామరూపుఁడు, జీవకునిఁ జంపినవెనుక సదానంద స్వామిమఠమునకుఁబోయి దాఁగియుండఁగా, రాజు తనకొఱకుఁ జేసిన తీర్పును విన్నవాఁడయి, అయ్యో! ఇదేమివిపరీతకాలము ? ఇట్టితీర్పు విధించుటకంటెను శిరశ్ఛేదము శ్రేష్ఠమగునే! నాకీ ప్రపంచమంతయును నీ వైశాలీ నగరపు ఎల్లగోడలకు లోపలనే కదా యున్నది! కమలినియొక్క చూపుల కగపడక నే నెట్లు బ్రదికియుండుట ? అది వసించు స్థలమే కదా నాకు నాకలోకము! దాని కితరస్థలము నరకలోకమే" యనుచు నిట్లే పలువిధములుగాఁ దనలోఁ బరితపించుచు నుండెను. ఆయుత్తముఁడైన సన్న్యాసి వీని వ్యసనము పోఁగొట్టు నిమిత్తము వేదాంతవాక్యము లనేకములు పలికెను. వీని కతని హితోపదేశముల యందు బుద్ధి చెల్లినది గాదు. తన తలవెండ్రుకలను బెరికికొనుచు వెఱ్ఱిపట్టిన వానివలె

దుఃఖించెను. “ స్వామీ ! మీ వేదాంతము లటుండనిండు. నే నింక బ్రదుకలేను ” అని, నేలమీఁదుఁగా దీర్ఘముగాఁ బరుండి, “ నేను జనిపోతినేని నన్ను సమాధిచేయుట కింత స్థలము చాలునా ? ” అని యడిగెను.

ఈరీతిగా వాఁడు చిత్తముచెదిరి, పరిదేవనము సేయుచుండఁగా వాని హృదయేశ్వరియగు కమలిని వానికిఁ గొన్ని సంగతులు చెప్పి పంపెను. వానిని వినఁగానే కామరూపుని చిత్తమునకు స్వస్థత గలిగెను, ఇదియే యుక్త సమయమని దలఁచి, సన్న్యాసి, “ నాయనా ! కామరూపుఁడ ! నీవు మగవాఁడవుగా జన్మించియు నిట్టు లధైర్యపడుట సరిగాదు. జీవకునిఁ జంపుట చాలదా ? నిన్నుఁ జంపుకొని నీ నిమిత్తము కమలిని సైతము ప్రాణములువదలునట్లు జేసెదవా ? ప్రాణికోటులలో నుత్తమమైనది మానవశరీరము. అట్లుండఁగా ధైర్యలక్ష్మిని జేవదలి యిచ్చచొప్పున మెలఁగుచు దుఃఖములకుఁ జోటిచ్చుచు బ్రమ్గుట మానవదేహమునకు లక్షణము గాదే ? అట్టిది మైనముతోఁ జేసిన యొక ప్రతిమయే. నీ విషయమున రాజు దయపెట్టి, నీకు మరణదండన విధింపక దేశభ్రంశమున కనుమతి యిచ్చెను. నిన్నుఁ జంపవచ్చిన మహావిరోధిని నవలీలగాఁ జంపివేసితివి. ఇట్టిసంభవములకు సంతసించుటకు మాఱుగా దుఃఖించుట వెఱ్ఱితనమే ! కమలినియో బ్రదికియున్నది. ఇంతేకాక యా యుత్తమురాలు నీ ధర్మపత్నియాయెను. నీవు ముఖ్యముగా దానినిగూర్చి దలపోయువాఁడవుగాన నీకింతకంటె సంతోషింపఁదగిన విష

యము మఱియొకటి గలదా ?" అని వానికి సంభవించిన మేళ్లనన్నిటినిఁ గూర్చి సన్న్యాసి వివరించి చెప్పెను. దుర్బుద్ధి గల దుష్టస్త్రీకి హితబోధ చేసిన నెట్లు రుచింపదో యట్లే సన్న్యాసియొక్క నీతివాక్యములు వానికి నెమ్మదిఁ గలిగింప దయ్యెను. వానిస్థితిని గాంచిన సన్న్యాసి, "నాయనా, కామరూప! ధైర్యము చేవదలి చింతలకుఁ జిత్తమునఁ జోటిచ్చువారు మిగుల ఘోరమగు మరణము ననుభవింతురు దీనిని నీవు జ్ఞప్తియం దుంపుము" అనెను. పిదప, కామరూపునకుఁ గొంత చిత్తము స్వస్థపడుటను గాంచి, "కామరూపుఁడా! నీ వీరేయి నీభార్యయగు కమలినియొక్క గృహమునకుఁ బోయి, దానియుత్తరువును బొంది సోమేశ్వర నగరమునకుఁ బోయిచేరుము. ఆనగరమునందే కొన్ని దివసములు వసించుచుండుము. నేను సమయము గని పెట్టియుండి మీయిరువుర కును జరిగిన వివాహమునుగూర్చి ప్రసిద్ధికిఁ దెచ్చెదను. ఈ సంతోషవార్త వినఁగానే నీతండ్రికిని నిమానముకును మిగుల నానందము గలుగును. పిదప వీరిరువురును జేరి రాజుగారిని వేడుకొనిరేని, రాజు తప్పక నిన్ను మన్నింపఁగలఁడు. అప్పుడు, నీ వెంత దుఃఖముతో నిప్పు డీ రాజధానిని వదలుచున్నావో, యంతకుఁ బెక్కుమడఁగు లెక్కువసంతోషముతో నీరాజ్యమునకు వచ్చిచేరఁగలవు" అని యివ్విధముగా సన్న్యాసి పలికిన హితోక్తులు సరియైనవే యని దలఁచి, కామరూపుఁడు, తన భార్యను జూచుటకు వానియొద్ద నుత్తరువును బొంది, "స్వామీ! మీయనుమతి ప్రకారమే, యీరేయి నా భార్యతోనుండి

ప్రాతఃకాలము వేళకు లేచి యొంటరిగా సోమేశ్వర నగరమునకుఁ బయనమయ్యెదను'' అనెను. అందుల కా యతీశ్వరుఁడు, ''నాయనా! సుఖముగాఁ బోయిరమ్ము, నేనప్పుడప్పుడు, నీకిచ్చటి సంగతులు దెలియపఱచుచుండెద'' ననెను.

అంతటఁ గామపాలుఁడు, కమలిని దనప్రీతిని వెల్లడి చేసిన తోఁటనుజూర్చి పోయి దాని కంచెగోడనెక్కి లోనికి దుమికి ఎవ్వరికిని దెలియక రహస్యముగా నచ్చోటినుండి దాని శయనగృహమును బ్రవేశించి యుదయపర్యంతము సంతోషముగా మెలఁగువాఁడయ్యెను.

ఈ యిరువు రపూర్వ దంపతులు దుఃఖమన నెట్టిదో యెఱుఁగక సంతోషమహాసముద్రమున మునిఁగి పరవశతను జెందియుండిరి. ఐనను దెల్లవాఱుజాము కాఁగానే, యెడఁబాయ వలయుననియును, ముందుదినము జరిగిన యుద్ధమును మరణించినవారిని దలఁచినప్పుడు వాండ్రనుభవించిన సౌఖ్యములును, సల్లాపించిన సంతోషకరములగు సంభాషణలును నిష్ఫలములయ్యెను. వీ రుభయులును దెల్లవాఱుచున్నదే యని తలఁచునప్పుడే మిగుల శీఘ్రముగాఁ బ్రొద్దు పోయినట్లు దూర్పుదెస వెల్లఁబాఱెను. అప్పుడు భరద్వాజాది పక్షి నికరములు కర్ణరసాయనములుగాఁ గలకలారావములు సేయఁ జొచ్చెను. ఆ ధ్వనులు విని కమలిని దెల్లవాఱెనని చెప్పనోపక యవి భరద్వాజ పక్షులుగావు రాత్రులయందుఁ బాటలుపాడు చకోరపక్షులని దనలో ననుకొని తృప్తిచెందఁ జూచెను. ఇది యెట్లు పర్యాలోచించినప్పటికిని భరద్వాజ

ములు చకోరములగునా ? అది తెలిసి యా కామినీతిలక మనుభవించిన మనోవ్యథకు మేరయే యుండలేదు. కావున, యావిహంగములయొక్క రమ్యములయిన పలుకులు చెవులకు ములుకులయి వెత గొల్పినవి.

ఇట్టి తరుణముననే తూర్పు తెల్లవారెను. అది వారి యెడఁబాటును జాటించు చిహ్నమై గోచరించెను. కామరూపుఁడు, ప్రాణేశ్వరి యగు కమలినిని జూచి, మిగుల వ్యసనముతో దాని యుత్తరువును బొంది, ,, బాలికా! నేను సోమేశ్వరమున వసించువాఁడనై గంటకొకతేప నాక్షేమములను గూర్చి నీకు జాబులు వ్రాయుచుందునని చెప్పి, దాని శయనగృహమును దాఁటి నిలచెను. అప్పుడు వానిని జూడఁగా సమాధిచేయుటకు సిద్ధముచేయఁబడిన ప్రేతమువలెఁ గమలిని నేత్రములకు నమంగళముగా గానవచ్చెను. ఆవిధముగానే కమలినిని జూచునప్పుడు కామరూపునికినిఁ దోఁచెను. అట్లుండియు సూర్యోదయమయిన వెనుక వాఁడు వైశాలీ నగరమం దగపడెనేని, శిరశ్ఛేదము చేయఁబడును గాన, శీఘ్రముగా నాచోటిని వదలి పోవలసినవాఁడయ్యెను.

కామరూపుఁడు సోమేశ్వరమును జేరిన కొన్ని రోజులకుఁ బిమ్మట ముసలివాఁడయిన శ్రుతకీర్తి ప్రభువు దన పుత్రికయగు కమలినికి వివాహము జరిగియుండుసంగతి దెలియనివాఁడగుటచేత దానిని వీరవర్మకిచ్చి పెండ్లిచేయింప నిశ్చయించెను.

వీరవర్మ యౌవనము, పరాక్రమము, ఔదార్యము,

మొదలగు సద్గుణములచేఁ గమలినికిఁ దగిన వరుఁడేయగును. నెట్లుండియు, కామరూపుని వివాహమాడి వానియెడలఁ దన చిత్తము నిలిపియున్న కమలినికి మఱియొకని విషయమున ఎట్లు బుద్ధి చెల్లఁగలదు ?

ఇట్లు దన తండ్రిగారు, తన్ను వీరవర్మ కోసఁగునట్లు చెప్పినమాటలను గమలిని విని, మిగుల దిగులుపడి యేమియుఁ దోపక, తండ్రిఁ జూచి, "నాయనా ! నాకు వివాహము చేయఁదగిన వయస్సు రాలేదే ! జీవకుఁడు చనిపోయిన దుఃఖముచే మిగుల నొచ్చియున్న నాకు వివాహము చేసెడి పక్షమునఁ జల్లనిచూడ్కులతో నా పెనిమిటిని నెట్లు చూడఁ గలను ? మఱియును, చనిపోయిన జీవకుని యుత్తరక్రియలు జరుపఁబడుటకుఁ బూర్వమే, మనయింటియందు వివాహ కార్యము నడచినయెడలఁ జూచువా రేమి చెప్పుదురు ?" అని తనకింతకుమున్నే వివాహమయిన సంగతిని దాఁచియుంచి, తనకు సమ్మతిలేమి ననే కేతరవిషయముల చేతఁ దెలియ పఱచెను శ్రుతకీర్తి దానిమాటల నన్నిటిని బెడచెవిని బెట్టి, "నేను చెప్పునట్లు వినుము. అట్లు నడుచుకొనుము ; నీకేల లేనిపోని పెద్దతనములు ? రాఁబోవు గురువారము నాఁటికి నిన్ను వీరవర్మకొసఁగి పెండ్లి చేసెదను. అందులకు నీవు సిద్ధపడియుండుము" అని వీరవర్మకుఁ గల సంపదను, యౌవనమును, గొప్పతనమును వివరించి చెప్పెను. మఱియు, వైశాలీనగరములోని కన్యకామణులలో నెవతె గాని వీరవర్మవంటి పెనిమిటి లభించిన దీనివలె ధిఃకరింపదే !

అట్లుండఁగా, దీనికి హానిని బెనిమిటిగాఁ జేయఁగోరినప్పు డేవో కారణములను జెప్పి నిరాకరించుచున్నదే! యిదేమి మూఢత యని దనలో ననుకొనెను శ్రుతకీర్తి.

ఇట్టి సంకటములు సంభవించునప్పు డంతయును, దనకుఁ దగిన యాలోచనలు చెప్పుచుండు సదానందస్వామి యొద్దకుఁ గమలిని పోయి, దనకుఁ దటస్థించియుండెడు కష్టములను జెప్పి, "స్వామీ! యిప్పుడు నేను జేయవలసిన దేమి?" అనెను.

అతఁడు, "కమలినీ! యిందుల కొకయుపాయము గలదు. అయినను, మనోదార్ఢ్యము గలిగి నీవు దానిని జేయుటకు సాహసింతువా?" అనెను.

ఆమాటలకుఁ గమలిని, "స్వామీ! నాప్రాణేశ్వరుఁడు కామరూపుఁడు బ్రదికియుండునప్పుడే వీరవర్మను బరిణయ మాడుటకంటె నన్ను జీవములతోఁ బల్లమున వేసి పూడ్చి నప్పటికిని సంతోషకరముగానే యుండును" అనెను.

అందులకు సన్న్యాసి, "ఓహో, కమలినీ! నీవింక నేమియును జెప్పకుము. అట్లయిన నీవు సంతోషముగా నింటికిఁ బోయి నీతండ్రి యిచ్ఛ చొప్పుననే మెలఁగునట్లు నటింపుము. వీరవర్మను బెండ్లిచేసికొనుటకు సమ్మతింపుము. ఇదిగో, నే నొసఁగెడు నీయోషధమును దీసికొనిపొమ్ము. దీనిని నీ పెండ్లికి ముందుదినము రేయి సేవించితివేని నలువది రెండు గంటలకాలము పీనుఁగువలె నూపిరియాడక పడి యుండఁగలవు. మఱుచటిదినము దయము నిన్నుఁ బిలుచుకొని

పోవుటకొఱకుఁ బెండ్లికొడుకు నీయింటికి వచ్చును. అప్పుడు వాఁడు నీస్థితినిఁ జూచి మరణించితివని దలఁచును, పిదప నీవారు నిన్ను పెట్టెలోఁబెట్టి, మూసి దీసికొనిపోవక యీదేశాచారప్రకారము మీవంశస్థులను బూడ్చియుంచుచోట నిన్ను సైతము పూడ్చివేయవలయునని యూరివెలుపల నున్న స్మశానవాటికకు తీసికొనిపోవుదురు.

,, నీవు బాలికామణివి గనుక యీ భయంకరమైన కార్యమును జేయుటకుఁ దెగింపవు. అట్లు భయపడక సమ్మతించితివేని యీయౌషధము తినిన నలువదిరెండు గంటలకాలము సుఖనిద్ర చెందినదానివలె నుండి లేవఁగలవు. నే నీ సంగతి నీ పెనిమిటికిఁ దెలిపి వానినచ్చటికి రావించి యెవ్వరికిని దెలియక రాత్రిపూట నిన్ను సోమేశ్వరమునకు నెత్తుకొనిపోవునట్లు దిట్టపఱచెద'' నని యౌషధము దానిచేతి కొసఁగెను. కమలిని, తనకుఁ గామరూపునియందుఁ గల పతిభక్తిచేతను, వీరవర్మను వివాహమాడవలయునే యను విరక్తిచేతను సదానందస్వామియెడలఁ గల విశ్వాసము చేతను దా నాభయంకర కార్యమును జేయుటకుఁ దెగించి యా యౌషధమును దీసికొని ,, స్వామీ! మీయనుమతి ప్రకారమే నడుచుకొనెద'' నని చెప్పి దనయింటికి వెడలి పోయెను.

ఇట్లు మఠమునుండి కమలి పోవుచుండఁగా వీరవర్మను సంధించెను. అప్పుడాయువతి వానిని జూచి, ,, అయ్యా, నేను మిమ్మును బెండ్లియాడఁబోయెదను'' అని తన యభి

ప్రాయమును దాఁచి పలికెను. ఈ సంగతి వినఁగానే శ్రుతకీర్తియు నతని భార్యయుఁ జాల సంతోషించిరి. ఇంతేకాక యీ శుభ వర్తమానమును విని ముసలివాఁడైన దాని తండ్రి తనకు యౌవనము దిరిగినంత సంతోషమనుభవించెను. వీరవర్మను వివాహమాడనని తన కత్యాప్తిని గలిగించిన కమలిని, దనమాటకు లోఁబడి నడుచుకొనినందులకుఁ దొల్లిటి వలెనే యది తన ప్రియపుత్రికగాఁ దలఁచెను. వివాహము దగ్గఱించుటచేత శ్రుతకీర్తి యింటియందు జనులయొక్క సందడి మెండుకొనియుండెను. ఇంతేకాక, యదివఱకు వైశాలినీ నగరమున జరిగిన వేడ్కలకును విందులకును మిన్నగాఁ దనయింట జరుపవలయునని యుద్దేశించి శ్రుతకీర్తిప్రభువు, తన ప్రాభవమునకుఁ దగినట్లు ధనము వ్యయపఱచెను.

బుధవారమురాత్రి కమలిని సన్న్యాసి దన కొసఁగిన యౌషధమును జేతికెత్తుకొని, "కామరూపునికిని నాకును రహస్యముగా వివాహము జరిపినందులకై జనులు దన్ను నిందింతురేమోయని లోకాపవాదమునకు భయపడి నన్నుఁ జంపివేయుటకే సదానందస్వామి యీ యౌషధ మొసఁగెనో? అయ్యో! లోకులు వారిని మహాత్ముఁడందురే! అట్టి యుత్తముఁడా యీ నీచకార్యమున కొడిగట్టును? మంచిది! ఈ యౌషధము చంపివేయక మైకమునుమాత్రము గలిగించునదియైన కామరూపుఁడు వచ్చి నన్నెత్తుకొనిపోవుటకుఁ బూర్వమే నామైకము దీఱిపోయినయెడల, నే నాభయంకరమైన స్మశానవాటికయం దొంటరిగా నెట్లుండనోపుదును?

అక్కటా! అస్థలమునందు నింతకుఁబూర్వము గతించిన మావారియొక్క శల్యము లాగదియుం దంతటను నిండి యుండునే! ఇంతేకాక యచ్చోట నిటీవలనే వేయఁబడి యుండు జీవకునియొక్క ప్రేతము క్రుళ్లి గాలుకొట్టుచుండునే! వీని నన్నింటిని జూచియు నాదుర్గంధమున కోర్చియు నే నెట్లచ్చోట బుద్ధిభ్రంశములేక దిటవు గలిగి యుండుదానను'' అని యనేకవిధములఁ దనలోఁదా ననుకొనఁజొచ్చెను.

,,అయ్యో! చనిపోయినవారు వికారములయిన పిశాచరూపముల ధరించి స్మశానభూమిని సంచరించుచుందురను కథలను నే నెన్నో వినియున్నానే! అట్లు నేనాపిశాచములకు నడుమ భయపడక యెట్లుండుదానను?'' అని పరితపించెను కమలిని. అట్లుండియును గామరూపునియెడఁ గలిగిన యనురాగమును, వీరవర్మయందలి వైరాగ్యమును దలపోసి ముందు వెన్కలాలోచింపక దటాలున నాయాపథమును దీసికొని లాహిరి దలకెక్కఁగా నేలపైకొరగెను కమలిని.

మఱుచటిదివసము ప్రాతఃకాలమున వీరవర్మ పెండ్లికూఁతును నిదురనుండి లేపుటకు మంగళవాద్యములతోడ వచ్చిచూడఁగా వస్త్రాభరణాలంకృతయై వెలయవలసిన కమలిని ప్రేతమై పడుకనంటి పడియుండెను. దానిఁ జూడఁగానే మిగుల భయంకరముగ నుండెను. వానికోర్కులన్నియు వెల్లిఁ గలిపిన చింతపండయ్యెను. ఆ యింటియందు నేవంకఁ జూచినను రోదనధ్వనులు పెల్లురేఁగియుండెను. వీరవర్మ, అయ్యో దుష్టబుద్ధియైన యముఁడు నన్ను వంచించి నేను

బెండ్లియాడనున్న యీ కమలినీగుణమణియొక్క ప్రాణ వాయువు లపహరించెను. "అయ్యో, దానిని దానికి మంగళ సూత్రము కట్టునంతటి భాగ్యము సైతము చేయనైతినే. ఇంతలోనే దానికీ దుర్మరణము సంభవింపవలయునా? ఆహా! నాకు దీని వియోగమిట్లు గలుగఁగలదనుట స్వప్నమందైన దెలియదు. ఏమి చేయుదును?" అని ప్రేమబంధువులతోఁ జేరి దానును వాపోవుచుండెను.

ఇది యిట్లుండఁగా, శ్రుతకీర్తి ప్రభువును నతని యిల్లాలును దమకుఁ గమలిని యేకపుత్రిక గావున దానిని జూచు చుండుటచేతనే సంతోషమనుభవించుచుండిరి. అట్టి ప్రియ తనూజను దగినవరునికిచ్చి వివాహముచేసి దాని సౌఖ్యాను భూతిని గనులారఁ జూడఁగోరియున్న సమయమున నన్యాయ ముగా, యముఁడు, కరుణమాలి దానిని జంపివైచెను. కావున వారికిఁ దటసించిన దుఃఖమునకు మేరగలదో? పోల్చి చెప్పుటకుఁ గానివిధముగా పురపురఁ బొక్కుచుండిరి. అప్పుడు కమలినియొక్క వివాహ మహోత్సవమునకు సేకరింపఁబడిన సామగ్రులన్నియు దాని ప్రేతోత్సవమున కుపయోగపడెను. వివాహమునందుఁ బాడఁదగిన మంగళ కరములయిన పాటలకుఁ బదులుగాఁ బ్రలాపధ్వనులు వెల్లు వేఁగినవి. పెండ్లికూఁతు రూరేగునసమయమునఁ బైనఁ జల్లు నిమిత్తము చేర్చియుంచిన పుష్పములు ప్రేతముపైఁ జల్లుటకు నుపయోగించినవి. వివాహము జరుపుటకు రావింపఁబడిన పురోహితుఁడు, అపరక్రియలు నెఱవేర్ప సంసిద్ధుఁడాయెను.

అటుపిమ్మట, దానిని దీసికొనిపోయి, యూరిబైటనున్న స్మశానవాటికలోని యొక గదియందుంచి తమయింటికిఁ బోయి చేరిరి.

కమలినికి నడిచిన ప్రేతకార్యములన్నియు సత్యములు గావనియు, నది నిజముగాఁ జనిపోవలేదనియు నా భయంకర మయిన సమాధి గదినుండి నీవు దాని నెత్తుకొనిపోవునంత వఱకు నీప్రియురా లచ్చోటనే నిద్రితభంగి పరుండియుండు ననియును సదానందస్వామి కామరూపునికి జాబు వ్రాసి పంపెను. అట్లు సన్న్యాసి జాగరూకత గలిగి మెలఁగి నప్పటికిని, శుభ సమాచారములకంటె నశుభ వర్తమాన ములు బహుశీఘ్రముగా వ్యాపకము నెందుట వాడుక. కావున సన్న్యాసి పంపిన మనుష్యుఁడు పోయి చేరుటకుఁ బూర్వమే తనప్రాణేశ్వరి చనిపోయిన దను వ్యసనకరమగు సంగతిని సోమేశ్వరమందున్న కామరూపుఁడు వినెను. అట్లు వినుటకుఁ బూర్వము, కామరూపున కెన్నఁడు లేనంతటి యుత్సాహమును సంతోషమును పొడమియుండెను. నాటికి ముందురేయి దాను కాలగతి నెందినట్లును, దనభార్య యచ్చోటికివచ్చి ప్రేమ దైవారఁ దనమోమున ముద్దులు పెట్టి నట్లును, అంతట పోయినప్రాణములు దన శరీరమునందుఁ బ్రవేశించినట్లును, తత్క్షణమే తా నొక చక్రవర్తిగాఁ జేయఁ బడినట్లును స్వప్నముగనెను కామరూపుఁడు.

ఇవ్విధముగా నొకఁడు దాను జనిపోయినట్లు దలఁచు కొనుటయు నాతలంపే స్వప్నముగా మాఱియుండుననుటయు

నమ్మఁదగనివిషయములే కదా! ఇట్లు వాఁడు కలను దలఁచి దలఁచి యాశ్చర్యపడుచుండు నవసరమునందే, వైశాలీ నగరమునుండి వచ్చిన జనులు కమలినీమరణమునుగూర్చి ముచ్చటించుకొనుచుండుటను గామరూపుఁడు వినెను. వాఁడు వారాడుమాటలు తన శుభకరమైన స్వప్నమున కనువుగాఁ దనకేదో శుభసమాచారమందఁగలదని దలఁచి వారి సంభాషణలను జెవియొగ్గి వినియును వారినడిగియును దాను దలఁచియున్న తలంపునకు విరోధముగాఁ గమలినీ మరణమును గూర్చి దెలిసికొనెను. స్వప్నమునఁ దన్ను ముద్దులు పెట్టి బ్రదికించిన కమలినిని జాగ్రదవస్థయందుఁ దా నెన్నివేల ముద్దులిడినను, ప్రియురాలు బ్రదుకఁజాలదని గ్రహించెను.

ఇంక నా ప్రాణేశ్వరియొక్క సన్నిధానము చేరుటకు జాగుచేయరాదు; అని దలఁచి, వైశాలీనగరము స్మశానవాటికదనుక నేను పోవలసియున్నది. గుఱ్ఱము సజ్జీకృతము చేయుము అని తన సేవకున కానతిచ్చెను. మిక్కిలిగా మోహపరవశులై పడియున్న యువ యువతీమణులకు నేదేనొక యల్పసంకటము దోఁచినయెడల దానిని సాంతముగా విచారింప నొల్లకయు; నోర్పుతో భరింపనొల్లకయు మిగుల నుత్పాత హేతువులగు నాలోచనలు సేయుట వాడుక. కావున, కామరూపుఁడు, సోమేశ్వరమునందలి యొక మందుల యంగడివానియొద్దకుఁబోయి విసమొసఁగుమని యడిగెను. ఆసోమేశ్వరమునందు విసము విక్రయింపఁదగ దను రాజశాసనము గలదు. అట్లు చట్టమునకు విరోధముగా విషము

విక్రయించువారిని శిరశ్ఛేదము చేయుదురు. అట్లుండియు నా యందులంగడివాఁడు మిగుల దరిద్రుఁడు. మొట్టమొదట కామరూపునకుఁ దాను విస మొసఁగనని యే చెప్పెను. ఎంత చెప్పిననేమి? కామరూపుఁ డొక్కపట్టుపట్టి తనకు విస మొసఁగవలయునని వాని దారిద్ర్యమే తీఱిపోవునట్లు పైక మొసఁగెను. ఆయంగడివాఁడు గర్భదరిద్రుఁడు గావున నా ధనమున కాసపడి విషమిచ్చి, ‚‚అయ్యా! యీవిషము సాధారణమైనది గాదు. దీనికుగ్రత యెక్కువ. ఏఁబది జనుల బలముగల మానిసిని సైతము క్షణకాలముననే విగ తాసునిఁ జేసివైచును ’’ అని చెప్పెను.

ఈవిధముగా విషము విలిచి, కామరూపుఁడు అశ్వ మెక్కి యానడికిరేయిని వైశాలీ నగరమునందలి స్మశాన వనముచేరి శ్రుతకీర్తి వంశమువారి నుంపఁదగిన సమాధిగదిని జేరి, యచ్చట నుంపఁబడియున్న తనప్రాణేశ్వరియొక్క శవముదాఁపునకుఁ బోయి చేరెను. ఆ తరుణమునందు, ‚‚ఓరి భ్రష్టుఁడా! కామరూపుఁడ! నిలుము నిలుము! తొలఁగి నిలువుము. అక్కడ నీవు చేయఁబోవు దుష్కార్యము నాకుఁ దెలియును’’ అనెడి మాటలు కామపాలునికి విన వచ్చెను. ఆమాటలకుఁ గామరూపుఁడు దిగ్భ్రమ నొంది నిలచెను. ఇట్లు మాటలాడిన యౌవనవంతుఁడు వీరవర్మ. వీఁడు స్మరించుటకును దగని భయంకరమగు నారేయి యందుఁ గమలిని యున్న చోటికిఁబోయి దానిపైఁ బుష్ప ములు చల్లి, ‚‚హా, కన్యకామణీ! నాకు భార్యవగుట

మాని యిట్లన్యాయముగాఁ గాలగతిని జెంది యీభయంకర ప్రేతవనమునం దొంటరిగా నున్నావే?" అని బిగ్గఱగా వెక్కి వెక్కి యేడ్చి తనదుఃఖభారమును దించుకొను నిమిత్తమే యచ్చోటికి వచ్చిచేరెను. వీరవర్మ, కమలినీ కామరూపులకుఁ గలిగిన సంబంధము దెలియనివాఁడు గావున, కామరూపుఁడు శ్రుతకీర్తివర్గమునకుఁ బ్రబలద్వేషి యగుటనుఁ జింతించి, వాఁడందలి పీనుఁగులకు నేమో యవమానము గలిగించు నిమిత్త మేఁగుదెంచినవాఁ డని దలఁచి, మిగులఁ గోపముతో, తొలఁగినిలుచునట్లు చెప్పె; కామరూపుఁడు నేరము చేసినవాఁ డగుటచేతను వైశాలీ నగరమునఁ దల చూపఁదగనివాఁ డగుటచేతను వానిని జెఱయం దుంప వలయునని యుద్దేశించెను.

ఆ ధిక్కారమునకుఁ గామరూపుఁడు, "ఓరీ, నాజోలి నీకేల? నన్ను వదలి దూరముగాఁ దొలఁగిపొమ్ము. జీవకుని గతి నీకుఁ దెలిసియేయున్నదిగదా! మఱచియుందువేని యిదిగో యిచ్చటనే పడియుండు వాని ప్రేతమును జూడుము. నాకుఁ గోపము రేఁపి, నిన్ను వధించునట్లు చేసి యేల నన్ను పాపమున కొడిగట్లు చేసెదవు?" అనెను. ఆమాటలను వీరవర్మ సడ్డచేయక, వాఁడు నేరము చేసినవాఁడని పట్టుకొనుటకుఁ బోగా నచ్చట వారిరువురకును గలహము గలిగెను. ఆ ద్వంద్వ యుద్ధమునందు వీరవర్మ చంపఁబడెను. పిదపఁ గామరూపుఁడు చంపఁబడినవాఁ డెవ్వఁడని దెలియుటకొఱకు దీపము దెచ్చి చూడఁగా, వాఁడు వీరవర్మ యగుట దెలియ

వచ్చెను. దాను సోమేశ్వరమునుండి వచ్చునప్పుడు, వీరవర్మ కమలినిని బెడ్డిఁగూడఁబోవుచున్నాఁడని వినియుండుటచేత, తనకుఁ బట్టించియున్న దుఃఖమునకు వాఁడు స్నేహితుఁడని దలఁచి, వానిచేతిని బట్టిలాగి, "నాయనా, వీరవర్మ! పరమ శూరులను సమాధి పెట్టఁదగిన గమలినియొక్క సమాధి గదియందే నిన్ను సైతముంచెదను" అని చెప్పుచునే సమాధి గది తలుపు దెరచెను. అచ్చట కమలిని చనిపోయిన వారి చిహ్నములు లేక ముఖవిలాసము గలిగి నిదురించు దానివలెనే కన్పట్టుచుండెను. ఆ రూపము చూడఁగానే వీని కేర్పడిన చింతకు మేరయుండలేదు. దానికి దాపుననే యొక్క బట్టనుజుట్టి, శరీరమంతయు రక్తమయమయి పడి యున్న జీవకుని పీనుగు గానవచ్చెను. వానినిఁ జూచి కామ రూపుఁడు, "నాయనా, జీవకుఁడ! నీవు మరణించినప్పటికిని నన్ను మన్నింపవలయును. నీశత్రువగు నన్ను నేనే చంపి కొని నీయొక్క పగను దీర్పఁబోయెదను" అని, కమలిని దెసకుఁ దిరిగి దాని ముఖమును బెక్కు తడవలకు ముద్దు పెట్టెను. దాని సౌందర్యవికాసమును గనులారఁ జూచి, మందులయంగడివానియొద్దనుండి దాను దెచ్చుకొనియుండిన విషము ద్రావి, తీఱని తన దుఃఖమునుండి విశ్రాంతి చెందిన వానివలెఁ దన ప్రాణేశ్వరి ప్రక్క కొరగిపడెను. కమలిని సేవించిన యౌషధము దానికిఁ గైపుమాత్రమే కలుగఁ జేసెను. ఇంతేకాక, కైపు తీఱఁగానే లేచి, కామరూపుఁడు రాకున్నాఁడే యనిగాని, దాను లేచుటకుఁ బూర్వమే విచ్చేసి

నాఁడనిగాని చెప్పుటకుఁ దగిన కాలము సమీపించుచుండెను. ఐనప్పటికిని గామరూపుఁడు త్రాఁగినవిషము మిగుల ఘోరమయినది గావున వాఁడు తత్క్షణమే ప్రాణవాయువులఁ బాసెను.

సన్న్యాసి, సోమేశ్వరమునకు బంపిన మనుష్యుడు, ఏదో యసందర్భముచేతఁ దామసించి కామరూపునికి సమాచారము చేరలేదని తలఁచి, కమలినికి దటస్థించిన దుస్థితిని విడిపించుట కచ్చటికి వచ్చెను.

అచ్చట దీపములు మండుచుండుటయును ద్వంద్వయుద్ధము జరిగినట్లు చిహ్నములు గానవచ్చుటయును జూచి సందేహముతో సమీపించెను. అట్లు వచ్చి చూడఁగా, గమలిని కొకప్రక్కన వీరవర్మ త్రెగి పడియుండుటయును, మఱియొక ప్రక్క గామరూపుఁడు ప్రేతమై పడియుండుటయును గానవచ్చెను. ఈ విపరీత సంభవములకుఁ గారణమేమని యూహించుటకుఁ బూర్వమే, కమలిని నిద్రలేచి సన్న్యాసినిఁ జూచి, తత్క్షణమే తానున్నచోటిని, తానచ్చటికి వచ్చిన విధమును జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని, ‘‘ స్వామీ ! కామరూపుఁ డెక్కడ ? ’’ అని విచారించెను.

అప్పుడు, సన్న్యాసి యేదో సందడినివిని దొందరపాటుతో, ‘‘ అమ్మా ! నన్నేమనుమనెదవు ? ఆటంక పఱచుటకుఁ గాని విధిచైదము మనయెన్నికల నన్నిఁటిని నాశముచేసె ’’ నని చెప్పి, జనుల కాలిసవ్వడి విని యెవ్వరో వచ్చుచున్నారని దిగులుపడి యా చోటును వదలి పాఱిపోయెను.

కమలిని దన ప్రాణాధిపుని చేతనున్న విషపు గిన్నెనుఁ జూచి, "అయ్యో, నావల్లభుఁడు విషముఁద్రావి తన ప్రాణములను బోకార్చికొనెనే! యీ గిన్నెలో నతఁడు ద్రావఁగా మిగిలిన విసమును ద్రాఁగి మరణించెదను" అని యా పాత్రమునుఁ జూచెను. అందు విసమించుకంతయును లేదు. ఇంతలో జనులు దనవంకకే వచ్చుచున్న సందడి విని దొం దరపాటుతోఁ దనయొడినున్న బాకుతో నురము పొడి చికొని విభునియొక్క ఱొమ్ముపై వ్రాలి ప్రాణములను వదలెను.

ఇంతలో వైశాలీనగరపు టారక్షకభటులా చోటికి వచ్చిచేరిరి. వీరవర్మయొక్క సేవకులలో నొకఁడు, తన యజమానునకును గామరూపునకిని గలిగిన కలహమును జూచి భయపడి 'హా' యని యఱచెను. ఆ కూయిని నగరములోనివారు విని, తాము వినినట్లే, కామరూపుఁడఁట, కమలినియఁట, వీరవర్మయఁట; ఏమో కేకలు వినవచ్చు చున్నవే యని పెనుసందడి చేయఁజొచ్చిరి. ఈసందడి వినఁ గానే శ్రుతకీర్తి సోమపాలురు దమ పడుకలనుండి త్రుళ్ళిపడి లేచి యాచోటికిఁ బాఱివచ్చిరి. ఈ కోలాహలధ్వనులకుఁ గారణమేమని విచారించునిమిత్తము రాజు నైతమచ్చోటికి వచ్చి చేరెను. ఇంతలో సన్న్యాసి యొడలు వడఁకుచుండఁగా నిట్టూర్పులు నిగుడ్చుచు నేడ్చుచు వచ్చుచుండెను. అతని రాకను సందేహించువారై యారక్షకభటులా సన్న్యాసినిఁ బట్టుకొనిరి. ఆసమాధి గదియొద్ద పౌరులందఱును వచ్చి

గుంపులుగూడిరి. అచ్చటనే యున్న రాజు సన్న్యాసిని జూచి, "ఎన్నటికిని వినఁబడని యిట్టి విపరీతమున కేమి కారణములు" అని యడిగెను.

అప్పుడు సన్న్యాసి, శ్రుతికీర్తి సోమపాల సామంత ప్రభువు లిరువురియెదుటఁ గడచిన సంగతిని విస్తరించి చెప్పుట కారంభించెను. "కమలినిని గామరూపునకుఁ బెండ్లిచేసి పెట్టితిని. కావున నిదిగో చనిపోయి పడియుండెడు కామరూపుఁడు కమలినికి భర్త. ఈ కమలినియును గామరూపుని యొక్క ప్రాణేశ్వరి. ఇట్లు నేను రహస్యముగాఁ జేసి యుంచిన పెండ్లి వెల్లడిచేయుటకుఁ దరుణమును గని పెట్టియుండఁగా, కమలినికి వివాహముచేయుటకుఁ బ్రయత్నించిరి. ఆ వివాహమునుండి తప్పించుకొను నిమిత్త మా కమలిని నేను జెప్పినట్లే లాహిరిని గలిగించు నౌషధమును దినెను. ఆ కారణమునుబట్టి యది చనిపోయిన ట్లందఱుఁ దలఁచిరి. అట్లుండఁగా, 'వైశాలీ నగరమునకు నీవు వచ్చి కమలినికి లాహిరిదీఱఁగానే దానిని నీ వున్నచోటికిఁ బిలుచుకొనిపొమ్ము' అని యొకజాబును వ్రాసి కామరూపునకుఁ బంపితిని. జాబు దీసికొని పోయినవాఁడు తామసించి యుండవలయును. కామపాలుఁ డేలకో యింకనురాఁడు. దానికిఁ గలిగిన కష్టము దొలఁగింపవలయునని దలఁచి యిచటికిరాఁగా, దాని కిరుప్రక్క కామరూపుఁడును వీరవర్మయుఁ జనిపోయి పడియుండుటను గాంచితిని, ఇంతవఱకే యీకథ నాకుఁ దెలియు" నని దనకుఁ దెలిసినంత చెప్పిముగించెను.

సన్న్యాసికిఁ దెలియనిసంగతులను గూర్చి వీరవర్మయుఁ గామపాలుఁడును ద్వంద్వయుద్ధము చేయుటను గూర్చి, వీర వర్మ సేవకులు చెప్పి ముగించిరి. ఇంతేకాక కామపాలుఁడు విసము ద్రాగుటకుఁ బూర్వ మొకజాబు వ్రాసి దానిని దన జనకున కొసఁగవలయునని వీరవర్మ సేవకుని చేతికిచ్చి యుం డెను. వాఁ డాతీరుననే యాజాబు సోమపాలునిచేతికా సమ యమునం దందించెను.

ఆలేఖయందు, కామరూపుఁడు దాను కమలినిని వివా హముచేసికొని యుండుటయును, అట్లు రహస్యముగాఁ జేసి కొని నందులకుఁ దన తల్లిదండ్రులు దన్ను క్షమింపవలయు ననియును, మందుల యంగడివానియొద్దఁ దాను విసము వెల కుఁ దీయుటయును, కమలిని సమాధిస్థలముచేరి, తన ప్రాణ ములను వదలఁ దలఁచియే తాను దానిని ద్రావుటయును వ్రాయఁబడియుండెను. దీని నంతటిని విమర్శించిచూడఁగా, కమలినీ కామరూపులకు మేలు గలుగఁదలఁచియే సన్న్యాసి తంత్రములు చేసినట్లు దెలియవచ్చెను. అయినప్పటికిని విధి వైపరీత్యమున నా యిరువురును బ్రాణములు వదలు వా రైరి. ‹‹ ఇందుకు సన్న్యాసి యేమిసేయును ›› అని యచ్చ ట మూఁగిన జను లనుకొనిరి.

అప్పుడు రాజు ముసలివాండ్రయిన సోమపాల శ్రుత కీర్తులనుజూచి, ‹‹ మీరు మృగములవలెఁ దెలివిమాలి యొకరినొకరు ద్వేషించుచుంటిరి. ఈ విషయమునుగూర్చి యోర్వఁజాలక మీకు దేవుఁడు విధించిన యతి ఘోర

మగు దండనను జూచితిరా? మీ బిడ్డలకుఁ గలిగిన పర స్పరానురాగమే యిట్టి విపరీతములకుఁ గారణమై పరిణ మించెను " అని నిందించి పల్కెను. చిరకాల విరోధులగు ప్రభువు లిరువురును ద్వేషమింతకుఁ బూర్వమే తొలఁగిపోయి యున్నందునఁ దమ శాత్రవము కమలిని కామరూపులతోఁ జేర్చి పూడ్చి వేయఁ దలంచిరి. అప్పుడు శ్రుతకీర్తి సోమపా లునిఁజూచి, ' అయ్యా, వియ్యంకుఁడ ! మనబిడ్డలకుఁ బెండ్లి జరిగినందున మన కుటుంబములు రెంటికిని బాంధవ్యము గలి గెను. ఇప్పుడు మీరు, నా పుత్రికయు మీ కోడలునునగు కమలినికి మీరు పెట్టఁదగిన యాభరణములకు బదులుగా మీ స్నేహము దయచేయుఁడు ' అని దీనముగా వేఁడెను. అందులకు సోమపాలుఁడు, ' అయ్యా, యిది చాలునా? యీ వైశాలీనగర ముండునంతవఱకు స్థిరముగా నుండునట్లు కమ లినివలెనే దాని యెత్తునకు సరిగా నొకస్వర్ణ విగ్రహముచేసి యుంచెదను ' అనెను. అందులకు శ్రుతకీర్తి నేనుకూడ కామ రూపునివలె నొక ప్రతిమను జేయించెద ననెను. ఇట్లు చిర కాలము ద్వేషమునకుఁ జిక్కిన యీ రెండుకుటుంబములవా రును దమబిడ్డల నాద్వేషమునకు బలియొసఁగిరి. పిదపఁ దా ము పరస్పరమైత్రి గలిగి మెలఁగుచుండిరి.



Printed at the Chandra Press, Madras.